

# భాస్కరశతకము.

టీకాతాత్పర్య విశేషార్థసహితము.

పండిత పరిశో

పబ్లిషర్సు:

మారుతిరాం అండ్ కో

శ్రీ రామాయనమః.

శ్రీ శారదాంబాయైనమః

# భాస్కర శతకము

టీకాతాత్పర్యసహితము.

---

ఉ॥ శ్రీగలభాగ్యశాలిఁ గడుఁ జేరఁగవత్తురు తారుదారె దూ
రాగమనప్రయాసమున కాదటనోర్చియునైన నిల్వను
ద్యోగముచేసి రత్ననిలయుండని కాదె సమస్తవాహినుల్
సాగరుఁ జేరుటెల్ల; మునిసన్నుత! మద్గురుమూర్తి భాస్కరా! 1

టీ. మునిసన్నుత=మునులచేస్తుతింపఁబడుచున్నట్టియు, మద్గురుమూర్తి=నాయొక్క గురుస్వరూపుఁడవైనట్టియు, భాస్కర=ఓ సూర్యభగవానుఁడా, దూరాగమనప్రయాసమునన్=దూరమునుండి యేతెంచుటవలనఁ బుట్టిన శ్రమను, ఓర్చియున్=సహించియు, నిల్వన్=నిలుచుటను, ఉద్యోగముచేసి=ప్రయత్నమొనరించి, తారు+తారు+ఎ=తమంతతామె, ఆదటన్=అనురాగముచేత, (ప్రేమచేత) శ్రీగలభాగ్యశాలిన్=సంపత్తుఁగల యైశ్వర్యవంతుని, కడున్=మిక్కిలి, (ఎక్కువగా) చేరఁగవత్తురు=సమీపించెదరు, ఎట్టులనఁగా; సమస్తవాహినుల్=సకలనదులును, సాగరున్=రత్నాకరుని (అనఁగాఁ సముద్రుని) చేరుట=సమీపించుట, ఎల్లన్=అంతయు, రత్న=రత్నములకు, నిలయుండని=స్థానమైనవాఁడనియే కదా!

తా. సకలనదులును రత్నాకరుండను యపేక్షతో సముద్రునిఁగలియు నట్లు పలుకష్టములకోర్చియైనను, ప్రజలు తమంతతామె ప్రేమఁజూపుచు భాగ్యవంతు నింటి కేతెంచుచుందురు.

ఉ॥ అంగననమ్మరాదు తన•యంకెకు రాని మహాబలాఢ్యు వే
భంగుల మాయలొడ్డి చెఱు•పందలపెట్టు వివేకియైన సా
రంగధ[illegible]వంబులు క•రంబులుఁగోయఁగఁజేసెఁదొల్లి చి
త్రాంగి[illegible]నేకముల్ నుడువ•రానికుయుక్తులుపన్ని భాస్కరా!

టీ. భాస్కరా! తనయంకెకున్=తనవశమునకు, రాని=రానటువంటి, మహాబలాఢ్యున్=మిక్కిలిబలముఁగల వానినైనను, వేభంగులన్=వేయిమార్గములుగా, (అనగా ననేకవిధములననుట) మాయలు=తంత్రములు, పన్ని=కూర్చి, చెఱుపన్=చెడగొట్టుటకు, తలపెట్టున్=తలంచును. కాబట్టి, అంగనన్=స్త్రీని, నమ్మరాదు=నమ్మఁగూడదు, తొల్లి=పూర్వకాలంబున, చిత్రాంగి=చిత్రాంగియనెడిస్త్రీ, వివేకియైన=జ్ఞానియైన, సారంగధరున్=తనసవతి పుత్రుఁడగు సారంగధరునిగూర్చి, నుడువన్=వచించుటకు, రానికుయుక్తులు=వలనుపడని ఘోరపన్నాగములను, పన్ని=కల్పనఁగావించి, పదమ్ములు=పాదములు, కరంబులు=హస్తములు, కోయఁగఁజేసెన్=ఖండింపజేసినది.

తా. దుర్మతియగు చిత్రాంగి జ్ఞానవంతుడయిన సారంగధరునిమీద లేనినేరము లారోపించి కరచరణములు నఱికించినట్లుగా, స్త్రీలు తమకు లోబడని బల్లిదునైనను వివిధమాయోపాయములు కల్పించి చంపఁజూతురు కావున స్త్రీలను నమ్మఁగూడదు.

ఉ॥ అక్కఱపాటువచ్చుసమ•యంబునఁ జుట్టము లొక్కరొక్కరి
న్మక్కువనుద్ధరించుటలు • మైత్రికిఁజూడఁగ యుక్తమేసుమీ

రొక్కట నీటిలో మెరక • నోడలబండ్లును బండ్లనోడలున్
దక్కక వచ్చుచుండుట నిదానము గాదె తలంప భాస్కరా! 3

టీ. భాస్కరా! అక్కరపాటు=తగినట్టి యవసరము, వచ్చు సమయంబునన్=వచ్చునట్టి వేళయందు, చుట్టములు=బాంధవులు, ఒక్కరొక్కరిన్=ఒకరినొకరు, మక్కువన్=దయచేత, (ప్రేమచే) ఉద్ధరించుటలు=కష్టములనుండి తొలగించుకొనుటలు, చూడగన్=యోచింపఁగా, (ఆలోచింపగా) మైత్రికిన్=స్నేహమునకు, యుక్తమేసుమీ=తగియున్న వేసుమీ, (ఎట్లనగా) ఒక్కటన్=ఒకకాలమందు, నీటిలో=నీటియందు, ఓడలన్=పడవల మీఁద, బండ్లును=శకటములును, మెరకన్=మెట్ట ప్రదేశమందు, బండ్లన్=బండ్లయందు, ఓడలున్=నావలును, తక్కక=నిలువక, వచ్చుచుండుట=వచ్చుట, తలంపన్=చూడగా, (విచారింపఁగా) నిదానము=తార్కాణము, (ప్రత్యక్షము) కాదె=కాదా! (అగునని యర్థము.)

తా. ఒక్కొక సమయమందున నీటిలో నోడలపై బండ్లును, మెరక ప్రదేశములయందు బండ్లపై నోడలును, వచ్చుచుండుట నిదర్శనము. అదేవిధముగ లోకంబున బాంధవ్యు లవసరముఁ గలిగినప్పుడు ఒకరినొకరు కాపాడుకొందరు.

చ॥ అడిగినయట్టి యాచకుల • యాశలెఱుంగక లోభవర్తియై
కడపిన ధర్మదేవత యొకానొకయప్పుడు నీదు వానిక
య్యోడలన దెట్లు; పాలుతమ కిచ్చునె యెచ్చటనైన లేగలన్
గుడువఁగ నీనిచోఁ గెరలి • గోవులు తన్నును గాక భాస్కరా! 4

టీ. భాస్కరా! (మానవుడు) లోభవర్తియై = లోభిగుణంబుఁగలవాడై, అడిగినయట్టి యాచకుల యాశలు = అడిగినయట్టి = వాంఛించినట్టి, (కోరునట్టి) యాచకుల=అర్థుల, ఆశలు=కోరికలు, ఎఱుంగక=తెలిసికొన

జాలక, కడపినన్=సాగనంపినచో, ఒకానొకప్పుడు=ఒకానొక సమయం బున, వానికిన్=ఆలోభి మనుజునకు, ధర్మదేవత=దైవము, ఈదు=ఒసగదు, అయ్యెడలన్=అట్టికాలములయందు, అదెట్లు=అదియెట్లనగా, లేగలన్=దూడలను, కుడువఁగన్ + ఈనిచోన్=కుడువనీయని యెడల, గోవులు=ఆవులు, కెరలి=కోపముగలిగి, తన్నునుగాక=తన్నుచుండునుగాని, పాలుతమకున్ = పాలన్నియు దామె పిదుకకొనఁ జూచువారికి, ఇచ్చునే=ఇయ్యకొనునా, (ఈయవు.)

తా. దురాపేక్షఁగల మనుజులు లేగలఁ గుడువనీయక, నావుపాలన్నియుఁ దామె యారగింపవలెనని ప్రయత్నించు వారికా యావులు బాలీయవు. అట్లె మనుజుఁ డత్యాశఁ గలవాఁడై తన్ను యాచించినవారికోర్కులఁ దీర్పక, వెడలనడిపినచో, నట్టి లోభికి ధర్మదేవతకూడ యొసంగదు.

చ॥ అతిగుణహీన లోభికిఁ బదార్థముగల్గిన లేకయుండినన్
మితముగఁగాని కల్మిగలమీఁదటనైన భుజింపఁడింపుగా
సతమనినమ్మి దేహమును సంపద నేఱులునిండిపాఱినన్
గతుకఁగఁజూచుగుక్క తనకట్టడమీఱక యెందు భాస్కరా!

టీ. భాస్కరా! అతి=ఎక్కువ, గుణ=గుణములచేత, హీన= కొఱంతయగు, లోభికిన్=లుబ్ధునకు, పదార్థము=ధనము, కల్గినన్-కలిగియున్నప్పుడు, లేకయుండినన్=లేనట్టికాలమందును, మితముగన్=తగినట్లుగా, భుజించును. కాని, కల్మి=భాగ్యము= కలమీఁదటనైనన్=కలిగినప్పుడైనను, ఇంపుగాన్=బాగుగా, భుజింపడు=భక్షణసేయడు, దేహమును కాయమును, (శరీరమును) సంపదన్=భాగ్యమును, సతమని=నిత్యమని, నమ్మన్=నమ్మకొనును, ఎట్టులనగా, ఏఱులు=నదులు, నిండి=పరిపూర్ణమయి, పాఱినన్=ప్రవహించుచుండినను, కుక్క=శునకము, ఎందున్=ఎచ్చటనైనను,

తనకట్టడల్=తననియమ ప్రవర్తనమును, నీఅక=జవదాటక=(తప్పక) కతు
కఁగన్=నాలుకతో కతుకుటకే, చూచుల్=నిరీక్షించుచుండును.

తా. ఏఱులునిండి పాఱుచుండినను, జలము తప్పకైనను, కుక్క తన నైజమును విడువక నాలుకతోఁ గతుకఁజూచునుగాని, బాగుగా త్రాగ నేరదు. అదేవిధముగా, లోభివానికి సంపదలెన్నియున్నను మితముతప్పక భుజించునేగాని, భాగ్యమున్నప్పుడైనను తనివిదీర భుజింపజాలడు.

చ॥ అదనుదలంచి కూర్చి ప్రజ • నాదరమొప్ప విభుండుకోరినన్
గదిసి పదార్థమిత్తు • రటుకానక వేగమె కొట్టితెండనన్
మొదటికిమోసమౌ;బాదుగు•మూలముగోసినఁబాలుగల్గునే!
పిదికినఁగాక భూమిఁ బశు•బృందమునెవ్వరికైన భాస్కరా

టీ. భాస్కరా! విభుండు=రాజు, అదను=సమయకాలమును, తలంచి ఆలోచనఁజేసి, కూర్చి=సంతోషమొందజేసి, ప్రజల్=ప్రజలను, ఆదర ము+ఒప్పన్ = సగౌరవమొదవునట్లుగా. కోరినన్ = (ధనమును, కో రఁగా, కదిసి = (ఆప్రభువును) సమీపించి, పదార్థము= ద్రవ్యము, ఇత్తురు= ఒసంగెదరు, అటుకాక = ఆసంగతి విచారింపక, వేగము+ఎ = త్వరిత ముగ, కొట్టి=జనులను హింసించి, తెండు = (ద్రవ్యమును) తీసికొనిరండు, అనన్=అనిపలికినచో, మొదటికిమోసము+ఔన్= ముట్టమొదటనే చెడి పోవును, (వానిచేఁజిక్కక వెడలిపోవుదురనుట) ఎట్లులనఁగా; భూమిన్= ధరయందు, పశుబృందమును=గోసమూహమును, పిదికినఁగాక=పిండినఁబా లుకలుగునుగాని, పొదుగుమూలము=పొదుగుమూలభాగమును, కోసినన్= కత్తితోఁగోసినయెడల, ఎవ్వరికైనన్=ఎటువంటివారికైనను, పాలుకలు గునె=క్షీరముదొరుకునే. (అనగా దొరకదనుట)

తా॥ మానవుఁడు నేర్పుచేత గోవులను జతికినఁ బాలునిచ్చునుగాని, పాముగుమూలమును గట్టిచేఁగోసినఁ బాలీయవు సరికదా మొదటికి మోస మగును. అట్లే, ప్రభువు తనప్రజలను మంచిమాటలచే నడిగినఁ గప్పములు చెల్లించుచుండెదరుగాని, దౌర్జన్యమువహించిన ధనాదు లియ్యకుండుటయే గాక, దేశమును బాసి పోయెదరు.

చ॥ అనఘునికైనఁ జేకుఱు ననర్హునిగూడి చరించునంతలో
మనమెఱియంగ నప్పు డవమానము కీడు ధరిత్రియందు నే
యనువుననైనఁదప్పవు యథార్థము; తానదియెట్టులన్నచో
నినుమునుగూర్చి యగ్నినలయింప దెసమ్మెటపెట్టుభాస్కరా!

టీ. భాస్కరా! ధరిత్రియందున్=భూమియందు, అనర్హునిన్=అర్హత లేనివానిని, కూడి=చేరి, చరించినంతలోన్=సంచరించునట్టివేళయందు, మనము=చిత్తము, ఎఱియంగన్=మందురీతిగా, అప్పుడు=ఆవేళయందే, అవమానము=తిరస్కృతి, (అగౌరవము) కీడున్=హానికరమును, అనఘునికైనన్=దోషరహితుఁడయినట్టివానికయినను, చేకుఱున్=సంప్రాప్తించును, ఏ+అనువునన్+ఐనన్=ఏయుపాయముచేతనయినను, తప్పవు=తప్పిపోవు, యథార్థము=నిజము, తాన్+అది+యెట్టులన్నచోన్=అదియెట్లనఁగా, ఇనుమును గూర్చి=ఇనుముతో నేకీభవించుటచే, అగ్నిన్=నిప్పును, సమ్మెటపెట్టు=సుత్తె దెబ్బ, అలయింపదె=కష్టపెట్టదే? (అనగా బాధించుననుట.)

తా॥ ఇనుము నాసించుటచే అగ్నికిగూడ సమ్మెటపోట్లు తప్పనట్లు, దుష్టునిసహవాసమున, బుద్ధిగలవారికిసయితము నగౌరవము, కీడుఁగలుగుట నిశ్చయము.

చ॥ అలఘుగుణప్రసిద్ధుఁడగునట్టి ఘనుండొకడిష్టుఁడై తనున్
వలచి యొకించుకేమిడిన వానికిమిక్కిలిమేలుచేఁయగా

తెలిసికుచేలుఁడొక్క కొంచెండడుకుల్ దనకిచ్చినన్ మహా
ఫలదుఁడు కృష్ణుఁడత్యధిక భాగ్యము లాతనికీఁడె? భాస్కరా! 8

టీ. భాస్కరా! అలఘు=ఘనమగు, గుణ=సద్గుణములచే, ప్రసిద్ధుఁడు=సత్కీర్తిగాంచినవాడు, అగునట్టిఘనుండు=అయినట్టి మహానుభావుఁడు ఒకఁడు=ఒకానొకడు, ఇష్టుడు+ఐ=హితవుగలవాఁడై, తన్నున్=తన్ను, వలచి వరించి, ఒక+ఇంచుక=కొద్దిగా ఏమి+ఇడినన్=ఏమియిచ్చినను, వానికిన్=ఇచ్చినయట్టి వానికి, మిక్కిలి=ఎక్కువ, మేలు=ఉపకారము, చేయుగా=చేయునుగదా? తెలిసి=(దేవుడని) తెలిసికొని, కుచేలుఁడు=కుచేలుడను నొకబ్రాహ్మణుడు, ఒక్కకొంచెండు=ఒక్కచేరెడు, అడుకుల్=అడుకులను, తనకున్=తనకు, (కృష్ణభగవానునకు) యిచ్చినన్=ఇచ్చియుండగా మహాఫలదుఁడు=గొప్పభాగ్యము లిచ్చునట్టి శ్రీకృష్ణుఁడు, అతనికిన్=ఆకుచేలునకు అత్యధికభాగ్యములు=అధికమయిన ఐశ్వర్యములు, ఈడె=ఈయఁడా? (ఇచ్చెనని యర్థము.)

తా. శ్రీకృష్ణభగవానునకుఁ గుచేలుడు చేరెడడుకులు భక్తితో నీయగా, వానికి సకలైశ్వర్యముల నొసంగెను. అవిధముగా గుణముగలవాఁడు తనయిష్టుఁడైయుండి యేస్వల్పమాత్ర మిచ్చినను అతఁడధికఫలము నొసఁగును.

చ॥ అవనివిభుండు నేరుపరియై చరియించినఁ గొల్చువారలె
ల్లవగుణులైన నేమి పనులన్నియుఁ జేకురు వారిచేతనే
ప్రవిమలనీతిశాలియగు రాముని కార్యము మర్కటంబులే
తవిలియొనర్పవే? జలధి దాటి సురారులఁద్రుంచి భాస్కరా!

టీ. భాస్కరా! అవనివిభుండు=భూనాథుడు, (రాజు) నేరుపరియై వివేకముగలవాఁడయి, చరియించినన్=ప్రవర్తించినచో, కొల్చువారలు=

సేవించెడిభృత్యులు, ఎట్లు=ఎట్టి, అవగుణులు=దుర్గుణముగలవారు, అయిన నేమి=అయిననుగాని, వారిచేత నే=అట్టిదుర్గుణముకలవారిచే నే, పనులన్నియున్=కార్యములన్నియు, చేకుఱున్=సిద్ధించును. (ఎట్లనగా) ప్రవిమల స్వచ్ఛందమైన, సీతశాలి=రాజనీతిచే విరాజిల్లుచున్నవాడు. అగురాముని కార్యము=అయినట్టిరామచంద్రునిపని. మర్కటంబులు ఏ=వానరులే తవిలి=పూనుకొని. జలధిన్=సముద్రమును, దాటి=దాటిపోయి సుర అరులన్=రాక్షసులను, త్రుంచి సంహరించి, ఒనర్పవే=చేసియుండలేదా? (అనఁగా నెఱవేర్చెననుట.)

తా॥ రాజనీతివిశాలుఁడగు రాముఁడు, అల్పులగు వానరులంగూడి వారధినిదాటి, రక్కసులఁ బరిమార్చి విజయుఁడయినట్లు వివేకశాలియగు రాజేంద్రుఁడల్పులను భృత్యులచేత నేగొప్పకార్యములనైన జేయింపఁ గలఁడు.

ఉ॥ ఆదరమింతలేక నరుఁ డాత్మబలోన్నతి మంచివారికిన్
భేదము చేయుటం దనదు • పేర్మికిఁ గీడగు మూలమెట్లు మ
ర్యాదహిరణ్యపూర్వకశిపున్ దనుజుండు గుణాఢ్యుఁడైన ప్ర
హ్లాదుని కెగ్గుచేసి ప్రళయంబును బొందఁడెమున్ను భాస్కరా!

టీ. భాస్కరా! నరుఁడు=మానవుఁడు, ఆదరము=అనురాగము, (ప్రేమ) ఇంత లేక=ఇంచుకయైని లేక, ఆత్మబల + ఉన్నతిన్=తనబలపరాక్రముచేత, మంచివారికిన్=సుజనులకు, భేదము=దుఃఖము, చేయుటన్=చేయుచుండుట చేత, తన=తనయొక్క, పేర్మికిన్=పెంపునకు, కీడుఅగున్=హానికలుగును. మూలము=దృష్టాంతము, ఎట్లు=ఏప్రకారమున, మున్ను=పూర్వము, అమర్యాదన్=దుర్వృత్తిచే, హిరణ్య=హిరణ్యశబ్దము, పూర్వ=మొట్టమొదట, శిపున్+అన్=కశిపుండను (అనఁగా హిరణ్యకశిపుండను యర్థము.) దను

జుండు=నిశాచరుఁడు, (రాక్షసుఁడు) గుణ+ఆఢ్యుడు=సుగుణాగ్రగణ్యుఁడు ఐన=అయినటువంటి, ప్రహ్లాదునకున్=ప్రహ్లాదునకు, ఎగ్గు=అపకారము, చేసి, ప్రళయంబును=నాశనమును, పొందఁడు+ఏ=పొందలేఁడే? (అనగా మృతిఁజెందెనని భావము.)

తా. తొల్లి, క్రూరాత్ముఁడగు హిరణ్యకశిపుఁడు గుణనిధియగు ప్రహ్లాదునకెగ్గుజేసి, మృతిఁజెందినటులే, మానవుఁడు లోకంబున దయాశూన్యుఁడై బలహీనుఁడగు సుజనుని హింసించినచో దప్పక ప్రాణములఁ గోలుపోవును.

ఉ॥ ఆరయ నెంతనేరుపరి యైన చరించిన వానిదాపునన్
గౌరవ మొప్పఁగూర్చు నుపకారిమనుష్యుఁడు లేక మేలుచే
కూరదదెట్లు? హత్తుగడ గూడునెచూడఁ బదాఱువన్నెబం
గారములోననైన వెలిగారముకూడక యున్న భాస్కరా! 11

టీ. భాస్కరా! ఆరయన్=ఆలోచనసేయఁగా, (మానవుఁడనుట) ఎంత నేరుపరి=మిక్కిలి నేర్పుఁగలవాఁడు, అయి చరించినన్=అయి నడచుచుండినను, వానిదాపునన్=వానిసామీప్యమున (దగ్గఱ) గౌరవము=ఘనత (గొప్పమర్యాద) ఒప్పన్=ఒప్పునటుల, కూర్చు+ఉపకారిమనుష్యుఁడు=చేకూర్చెడి యుపకారియైన మనుజుఁడు, లేక, మేలు=మంచి, చేకూరదు=కలుగనేరదు, అది+ఎట్లు=అదియేప్రకారమనఁగా, చూడన్=చూడఁగా, (విచారింపగా) పదాఱువన్నె బంగారములోనన్+ఐనన్=మేలిమిబంగారులోనయినను, వెలి+గారము=బంగారునకుఁ గాంతినిచ్చెడి వెలిగారమను తెల్లనియుప్పు, కూడక+ఉన్నన్=కలియకున్నయెడల, హత్తుగడగూడును+ఏ=అంటుకొని యుండునా? (అంటుకొనదనియర్థము.)

తా. పదునారువన్నె బంగారమైనను టంకమునకు వెలిగారము లేనిదే అంటుకొనని విధముగా, మానవుఁడు తానెంత విద్యానిధియైనను గౌరవము గలిగించెడి యుపకారి ప్రాపకము లేనిచో మేలుకలుగదు.

ఉ॥ ఈక్షితి నర్థకాంక్ష మది • నెప్పుడు పాయక లోకులెల్ల సం
రక్షకుఁడైన సత్ప్రభుని • రాకలఁ గోరుదు రెందుఁ జంద్రికా
పేక్షఁ జెలంగి చంద్రుఁ డుద • యించు విధంబున కై చకోరపుం
బక్షులు చూడవే యెదుర • పారముదంబును బూని భాస్కరా! 12

టీ. భాస్కరా! ఈక్షితిన్=ఈధరయందు, ఎల్లలోకులు=మనుజులందఱును, అర్థకాంక్షన్=ధనము పైనాసను, ఎప్పుడు=ఎల్లవేళలను, పాయక=విడువక, సంరక్షకుఁడు=తమ్ముఁబోషించెడివాఁడు, ఐనసత్+ప్రభునిరాకలు=అయినట్టి మహారాజు యాగమనములును, ఎందున్=ఏకాలమందైనను, కోరుదురు=ఎదురు జూచుచుందురు, ఎట్లన; చకోరపు=బక్షులు=వెన్నెలపులుగులు, చంద్రికా+అపేక్షన్=వెన్నెలయందుఁగల యాసక్తిచే, చెలంగి=ఆనందాతిశయము కలవై యుండి, చంద్రుఁడు=జాబిల్లి, ఉదయించు విధంబునకై+అయి=చంద్రోదయము కొఱకయి, అపారముదంబును=అమందానందమును, పూని=పొంది, ఎదురుచూడవే=నిరీక్షించుకొని యుండవా? (అనఁగా వేచియుండునని యర్థము.)

తా. వెన్నెలకాసించి చకోరపక్షు లమితానందముఁ బొందును. చంద్రుఁ డెప్పుడుదయించునోయని వేచియుండు విధముగా, మనుజులు ధనముపై నాసచేఁ బ్రభువురాకకై యెదురుచూచు చుందురు.

ఉ॥ ఈజగమందుఁ దా మనుజుఁ • డెంతమహాత్మకుఁడైన దైవమా
తేజము తప్పఁ జూచునెడఁ • ద్రిమ్మరకోల్పడు నెట్లన న్మహా
రాజకుమారుఁడైన రఘు • రాముఁడు గాల్నడఁ గాయలాకులున్
భోజనమై తగన్వనికిఁ • బోయి చరింపఁడె మున్ను భాస్కరా! 13

టీ. భాస్కరా! మనుజుఁడు=మనుష్యుఁడు, తాన్=తాను, ఈజగమందున్=ఈలోకమునందు, ఎంతమహాత్మకుఁడు=ఎటువంటి గొప్పవాఁడు

ఐనన్ = అయినను, దైవము=ఈశ్వరుఁడు, ఆ తేజము=ఆమహాత్మ్యశ్రీ (ప్రభావము) తప్పన్ = తప్పునట్లుగా, చూచు + ఎడన్ = చూచునట్టి వేళయందు, త్రిమ్మరి=సంచారమొనరించి, కోలు + పడున్ = సర్వము పోగొట్టుకొనును, ఎట్లనన్; మహారాజకుమారుఁడు= రాజరాజగు దశరథుని కుమారుఁడు, ఐన రఘురాముఁడు=అయినట్టి శ్రీరామచంద్రుఁడు, కాయలు=పండ్లును, ఆకులు= పత్రములును, భోజనము అయి=ఆహారమయి, తగన్=తగునట్లుగా, కాల్ + నడన్=కాలినడకతో, వనికిన్ =అడవికి, పోయి= వెళ్ళి, చరింపఁడు+ఏ= సంచారము సేయలేదా? (అనఁగాఁ దిరిగెననుట)

తా. జానకీ చిత్తచోరుండగు రాముండు కాలినడకతో నరణ్యమునకేగి, ఆకులలములను భక్షించుచుఁ దిరుగాడినటుల, మానవుఁ డెంతటి వాడయినను, యీశ్వరానుగ్రహము లేనప్పుడు సకలమునుఁ గోలుపోయి, యన్యదేశముల గ్రుమ్మరుచుండును.

చ॥ ఉరుకరుణాయుతుండుసమ•యోచితమాత్మఁదలంచియుగ్రవా
క్పరుషతఁజూపినన్ ఫలముఁ•గల్గుటతథ్యముగాదె యంబుదం
బుఱిమినయంతనే కురియు•కుండునె వర్షము లోకరక్షణ
స్థిరతరపౌరుషంబున న•శేషజనంబులెఱుంగ భాస్కరా! 14

టీ. భాస్కరా! ఉరుకరుణాయుతుండు=ఎక్కువయిన దయతోఁగూడినవాఁడు. సమయ+ఉచితము=కాలమునకుఁదగినయాలోచన, ఆత్మన్= హృదయమునందు, తలంచి=తలపోసి, ఉగ్ర+వాక్+పరుషతన్=భయంకరమైన మాటలయొక్క కఠినత్వమును, చూపినన్=చూపించినను, ఫలము= లాభము, కల్గుట=ప్రాప్తించుట, తథ్యముకాదు+ఏ=నిశ్చయమేకదా; ఎట్లన; అంబుదము=మేఘము, ఉఱిమిన+అంతన్+ఏ=ఉఱిమినంతమాత్రముననే, లోక=ప్రజలను, రక్షణ=రక్షణసేయుటందు, స్థిరతర=స్థిరతరమైనయట్టి, పౌ

రుషంబునన్=మగటిమిచేత, (శౌర్యముచేత) అశేషజనంబులు=జనులెల్లరును, ఎఱుంగన్=తెలిసినట్లు, వర్షము=వాన, కురియకుండునా=వర్షింపక యుండునా? (అనగా కురిపించునని)

తా. ప్రారంభసమయమున మేఘము యురుములచే జనులకు భయోత్పాతముఁగలిగించినను, పిమ్మటవర్షించి జనానందమొసఁగునట్లే, దయార్ద్రహృదయుడు సమయానుకూలముగ కఠినోక్తులాడినను దరువాతఁదప్పక మేలొసంగును.

చ॥ ఉరుగుణవంతుఁ డొడ్లుదనకొండపకారము సేయునప్పుడుం
బరహితమేయొనర్చు నొకపట్టుననైనను గీడుఁజేయఁగా
నెఱుఁగఁడునిక్కమేకదయదెట్లనఁగవ్వముఁబట్టియెంతయున్
దరువఁగఁజొచ్చినంబెరుఁగుతాలిమినీయదెవెన్న భాస్కరా!

టీ. భాస్కరా! ఒడ్లు=పరులు (ఇతరులు) తనకున్=తనకు, ఒండు+అపకారము=ఒకకీడు, చేయు+అప్పుడున్=చేసెడివేళయందైనను, ఉరుగుణవంతుఁడు=మేటిగుణములుగలవాఁడు, పరహితము+ఏ=ఇతరుల కుపకారమునే, ఒనర్చున్=చేయును, ఒకపట్టునన్+ఐనను= ఒక సమయమందైనను, కీడు=హానిని, చేయన్+కాన్=చేయుటకు, ఎఱుఁగఁడు=తెలియఁడు, (తెలిసికొనఁజాలడు) నిక్కము+ఏకదా=నిశ్చయమేకదా (నిజమేకదా) ఎట్లనగా; పెరుగు=దధి, కవ్వమున్+పట్టి=కవ్వమునుచేతఁగొని, ఎంతయున్=మిక్కిలి, తరువఁగన్+చొచ్చినన్=తరచుచున్నను, (మథించినను) తాలిమిన్=ఓర్పుచే, (శాంతముచే) వెన్నన్=నవనీతమును, (వెన్నను) ఈయను+ఏ=ఈయదా (ఇచ్చునని యర్థము.)

---

15. ఒడ్లు=పగలు, ధాన్యము అనఁబడును. "గుప్పెడుకూసరొడ్లు" అని ఘట్టుప్రభుని కుచేలోపాఖ్యానమునందలి ప్రయోగము.

తా. జనులు తన్నుఁ గవ్వము చేఁగొని తరచుచున్నను, వారికిఁగీడుసేయక, పెరుగు తనయందున్న వెన్నను ప్రజలకొసంగురీతిగా; గుణవంతుఁడు తనకొరులు హానిసేయుచున్నను, తానట్టివారలకు మేలుఁ గూర్చునుగాని కీడుఁజేయఁడు.

చ॥ ఉరుబలశాలినంచుఁ దను•నొల్లని యన్యపతివ్రతాంగనా
సురతముఁగోరెనేని కడ•సుమ్మది భూతికిఁ బ్రాణహానియౌ
శిరములుగూల రాఘవుని•చే దశకంఠుఁడు ద్రుంగిపోఁడే
యెఱుఁగక సీతకాసపడి• యిష్టులభృత్యులఁగూడిభాస్కరా!

టీ. భాస్కరా! మనుష్యుఁడు (అధ్యాహారము) ఉరు=ఘనమైన (అధికమైన)బలశాలిన్ + అంచు=బలముచే నొప్పుచున్నవాఁడనని,తనున్=తన్ను, ఒల్లని=పరాంగనా సురతమున కొప్పుకొనని, (ఇష్టపడని) అన్య=వేఱొక, పతివ్రతగ + అంగానా=పతివ్రతగల స్త్రీలయొక్క, సురతము=సంగమము (స్నేహము) కోరెన్ + ఏని=వాంఛించినచో (కోరినచో) అది=ఆవాంఛ, భూతికిన్=సంపదకు (ఐశ్వర్యమునకు) కడసుమ్మ=అంత్యకాలముసుమీ (నాశనమగుట) ప్రాణహాని=ప్రాణాపాయము. (శరీరమునుఁ గోలుపోవుట) ఔన్=అగును, (ఎట్లన) దశకంఠుఁడు=రావణుఁడు (రాక్షసుఁడు) ఎఱుఁగక=తెలిసికొనలేక, సీతకున్=రాముని దేవేరికొరకు, ఆసపడి=ఆశించి, ఇష్టులన్=హితులను, (స్నేహితులను) భృత్యులన్=సేవకులను, కూడి=వారితోఁగలిసికొని, రామునిచేన్=రామభద్రునిచే, శిరములు=తలలు, కూలన్=తెగిపడఁగ, త్రుంగిపోఁడు + ఏ=మృతిఁజెందలేదా? (చచ్చెననుట)

తా. కామాంధుడై రావణుఁడు సీతాదేవిని వరించి, బంధుజన సుతామాత్యముగ నాలమునఁజచ్చెను. కావున, మనుష్యుఁడు బలైశ్వర్యముల గలవాఁడనని కండకావరముచేఁ దనయందుఁ గోర్కెలేని యబలను బలాత్కరించిన నైశ్వర్యానులతో, బ్రాణంబులఁ గోలుపోవును.

ఉ॥ ఊరకవచ్చుఁ బాటుపడకుండిననైన ఫలంబదృష్టమే
పారఁగఁగల్గువానికిఁ బ్రయాసమునొందిన దేవదానవుల్
వారలటుండఁగాఁ నడుమవచ్చిన శౌరికిఁ గల్గెఁగాదె శృం
గారపుఁబ్రోవులక్ష్మియునుఁ గౌస్తుభరత్నము రెండు భాస్కరా!

టీ. భాస్కరా! అదృష్టము=భాగ్యము, ఏపారఁగన్=వృద్ధిఁజెందునట్లు, కల్గువానికిన్=కలిగియున్న మనుజునకు, పాటు=శ్రమ (కష్టము) పడక యుండినన్=పొందక పోయినను, ఫలంబు=లాభము, ఊరక=మిన్నక, వచ్చున్=వచ్చుచుండును, (ఎట్లనఁగా) ప్రయాసమున్=శ్రమను, (ఆయాసమును) ఒందిన దేవదానవుల్ చెందిన సురలును అసురులును, వారలు=ఆదేవతలు రాక్షసులు, అటు + ఉండఁగాన్=అట్లు ప్రత్యేకముగ నుండఁగా, శృంగారపుఁబ్రోవు=అందముల కుప్పయగు, లక్ష్మియును=శ్రీలక్ష్మీదేవియును, కౌస్తుభరత్నము=కౌస్తుభమాణిక్యము, రెండున్=రెండును, నడుమన్=మధ్యవేళను, వచ్చిన శౌరికి=విచ్చేసినవిష్ణుమూర్తికి, కల్గెన్ + కాదు + ఎ=ప్రాప్తించెనుగదా. (లభించెనుగదా!)

తా. రాత్రింబవళ్లు శ్రమలొందుచున్న సురాసురులకు లభింపక, సముద్ర మథనకాలము నందుద్భవించిన శ్రీదేవియు, కౌస్తుభమును, కష్టపడకుండ మధ్యవచ్చిన విష్ణుమూర్తికి ఫలప్రాప్తి అగునటుల, అదృష్టవంతునకు ప్రయాసము లేకయే ఫలితముఁ గలుగును.

ఉ॥ ఊరకసజ్జనుండొదిఁగియుండిననైన దురాత్మకుండు ని
ష్కారణమోర్వలేక యపకారముచేయుట వానివిద్యగా
చీరలునూఱుటంకములు చేసెడివైనను బెట్టెనుండఁగాఁ
జేరి చినింగిపోఁ గొఱుకు చిమ్మట కేమిఫలంబు? భాస్కరా!

టీ, భాస్కరా! సత్ + జనుండు=యోగ్యుఁడు, ఊరక=ఇతరులజోలికినిఁ బోక ఒదిగి=అడఁగి, (అణగి) ఉండినన్ + ఐనన్=ఉండినప్పటికిని, దుర్ న్ +

ఆత్మశపంథము=సుప్తాత్ముడు=చెడుమనస్సుకలవాడు నిష్కారణముగ=హేతువేమియు లేక (కారణములేకుండ) ఓర్వలేక=చూడలేక (సహింపజాలక అపకారము=కీడు, చేయుట=ఒనర్చియుండుట (సజ్జనునకపకారముసేయుట) వానివిద్యకా=అతనియొక్క కార్యమేకదా, (ఎట్లన) చీరలు=బట్టలు, నూరుటంకములు=నూరుమొహరీలు, చెల్లెడివి=వెలగలిగినవి, అయినను=అయినప్పటికిని, పెట్టెన్=పెట్టెలో=ఉండగాన్=ఉండినప్పుడు, చేరి=వాటిని సమీపించి, చినింగిపోన్=అంచులు శిథిలములగునటుల(పాడగునటుల)కొఱుకు=కొఱుకుచున్నటువంటి, చిమ్మటకున్=చిమ్మటయనెడిపురుగునకు, ఏమి ఫలంబు=ఏమిలాభముగలుగును? (అనగా ఫలితములేదనియర్థము.)

తా. వెలకుమించిన వస్త్రములు పెట్టెలోనున్నప్పటికిని, దనకేమియు ఫలితము లేకపోయినను, చిమ్మటాయంబరములను ముక్కముక్కలుగ గొఱికివేయునటుల సజ్జనులొకమూల నొదిగియున్నను, దుష్టుడు తనకు లాభముగలుగకపోయినను, యకారణముగ నాయుత్తమున కపకారముఁ జేయుచుండును.

ఉ॥ ఎట్టుగఁబాటుపడ్డ నొకయించుక ప్రాప్తము లేక వస్తువుల్
పట్టుపడంగ నేరవు ; నిబద్ధిసురావళిగూడి రాక్షసుల్
గట్టుపెకల్చిపాల్కడలిఁ గవ్వము చేసిమథించిరంతయుఁగా
వెట్టియకాక యేమనుభవించిరి వా రమృతంబు? భాస్కరా!

టీ. భాస్కరా! ఎట్టుగన్=ఏరీతిగ (ఎవిధముగ) పాటుబడ్డన్=శ్రమపడినను, ఒక+ఇంచుక=కొంచెమయిన) ప్రాప్తము=అదృష్టము, వస్తువుల్ వస్తువులు (ద్రవ్యములు) పట్టుపడంగన్ నేరవు=లభింపవు, దొరకనేరవు) నిబద్ధి=నిజము, (ఎట్లనగా) రాక్షసుల్=పలలాశినులు సుర+ఆవళిన్=దేవతాసంఘమును, కూడి=వారితోఁగలిసికొని, గట్టున్=

18. టంకము=వెలి రము, కత్తిరియొలు, గడ్డపాఱ, గోపము.
టంకములు=పదియారు డబ్బుల బంగారు నాణెములు, అనియర్థము.

మంధరాద్రిని, (మంధరపర్వతమును) పెకల్చి=పెల్లగించి, కవ్వముచేసి=కవ్వముగానొనర్చి, పాల్కడలిన్=క్షీరసాగరమును, మధించిరి=తరిచిరి, అంతయున్=రాక్షసులకష్టమంతయు, వెట్టియకాక=ఫలాశూన్యమే కాని, వారు=ఆయసురులు, (దైత్యులు) అమృతంబును=సుధను, ఏమి అనుభవించిరి=ఏమి పానముం జేసిరి. (అనగాద్రావలేదని యర్థము.)

తా. దైత్యులు దేవతలతోఁ జెలిమిఁజేసి, మందరాద్రిసిదెచ్చి కవ్వముగాఁజేసి పాలసముద్రమును బహుప్రయాసముతో తరిచినను, రాక్షసుల కమృతము దొరికినదికాదు. కావున, మానవమాత్రుడెంతటి యాయాసమునకుఁ గడంగినను, దానారగించు యోగ్యములేనప్పుడు, పడిన కష్టమంతయు వ్యర్థయగును.

చ॥ ఎడపక దుర్జనుండొరులకెంతయుఁ గీడొనరించుఁగాని యే
యెడలను మేలుసేయఁడొకించుకయైననుఁ జీడపుర్వుఁదా
జెడఁదినునింతె కాక పుడిసెండుజలంబిడి పెంపనేర్చునే
పొడవగుచున్న పుష్పఫలభూరుహమొక్కటినైన భాస్కరా!

టీ. భాస్కరా! దుర్జనుండు=క్రూరుఁడు, ఎడపక=వదలక, ఒరులకున్=పరులకును, ఎంతయున్=మిక్కిలి, కీడు=దుర్మార్గమును, (చెడుగును) ఒనరించున్ × కాని=చేయునుఁగాని, ఏ × ఎడలను=ఎప్పుడైనను, ఒక × ఇంచుకయు × ఐనను=కొంచెమయినను, మేలు=బాగును, చేయఁడు=చేయఁబోడు (ఎట్లనన్) చీడపుర్వు=చీడపురుగు, తాన్=తాను, చెడన్=చెడునట్లుగా, తినున్=భక్షించుఁగాని, పుడిసెండుజలము=చేరెఁడునీళ్ళను, ఇడి=పోసి, పొడవు=పెంపును అగుచున్న=కాంచుచున్న, పుష్ప=పువ్వులతోను, ఫల=పండ్లతోను (కూడియున్న) భూరుహమున్=చెట్టును, ఒక్కటిన్ × ఐనన్=ఒకదానినైనను, పెంపన్ నేర్చునే=వృద్ధిఁజేయఁగలదా? (అనగావర్ధింపలేదనుట)

తా. బాగుగ వృద్ధిబొందెడి ఫలవృక్షములను, జీడపురుగుకొట్టికివేయు చుండునుగాని, చేదెడు జలముఁబోసి ఒకవృక్షమునైనఁ బెంపలేనటుల, దుర్జనుండొరులకుఁ గీడుసేయఁజూచునేగాని, మేలుచేయడు.

ఉ॥ ఎడ్డమనుష్యుఁడేమెఱుఁగు • నెన్నిదినంబులుగూడియుండినన్
దొడ్డగుణాఢ్యునందుఁగల • తోరపువర్తనలెల్లఁ బ్రజ్ఞఁబే
ర్పడ్డవివేకిరీతిరుచి • పాకము నాలుకగా కెఱుంగునే?
తెడ్డది కూరలోఁగలియఁ • ద్రిమ్మరుచుండిననైన భాస్కరా!

టీ. భాస్కరా! ఎడ్డమనుష్యుడు=మూఢమానవుఁడు ఎన్నిదినంబులు - ఎన్నివాసరములు, కూడియుండినన్ = చేరియున్నప్పటికిని, దొడ్డగుణ + అఢ్యునందున్=సుగుణములచే నొప్పుచున్న మానవునియందున్న కలతోరపు వర్తనలు + ఎల్లన్=కలిగియున్న సత్ప్రవర్తనలన్నింటిని, ప్రజ్ఞచే బుద్ధిబలముచే, పేరు + పడ్డవివేకరీతిన్=విఖ్యాతిఁగాంచిన జ్ఞానివలె, ఏమి + ఎఱుంగును=ఏమితెలిసికొనఁగలఁడు, (ఎట్లనన్) రుచిపాకము=రుచిపాకముయొక్క మాధుర్యము, నాలుకగాక=జిహ్వగాక, తెడ్డు=గొయ్యగరిటె, కూరలోన్=కూరయందును, కలయన్=అంతటను వ్యాపించి, ద్రిమ్మరుచు + ఉన్నను=తిరుగుచున్నను, అది=అకట్టుగరిటె, ఎఱుంగునె=ఎఱుఁగఁగల్గునా? (అనఁగా తెలిసికొనలేదనుట)

తా. బాగుగాఁ బచనముచేసిన కూరయొక్క చవిని నాలుక తెలిసికొనునుగాని, ఎల్లప్పుడు నుడికయుడకని కూరలలోఁ దిరుగుచుండు తెడ్డారుచి పాకము యెఱుంగనటుల, గుణాఢ్యుని సత్ప్రవర్తనములు జ్ఞానికిఁ దెలియునుగాని, మూఢుడెంతకాలము చెలిమిఁజేసినను గుణము గ్రహింపనేఱఁడు

ఉ॥ ఎప్పుడదృష్టతామహిమ • యించుకపాటిలు నప్పుడింపుసొం
పొప్పుచునుండుఁగాకయది•యొప్పనిపిమ్మటరూపుమాయుఁగా

నిప్పున నంటియున్న యతినిర్మలినాగ్ని గురుప్రకాశముల్
దప్పిననట్టిబొగ్గునకుఁ దానలుపెంతయుఁబుట్టుభాస్కరా!

టీ. భాస్కరా! ఎప్పుడు—ఏవేళయందు, (ఏకాలమందు) అదృష్టతామహిమ—భాగ్యాభివృద్ధి, భాగ్యముయొక్క పెంపు) ఇంచుక—కొంచెము, పాటిలున్—ప్రాప్తించునో, అప్పుడు—ఆకాలమందు, ఇంపుసొంపు—చక్కదనాతిశయము, ఒప్పుచునుండుగాక—విరాజిల్లుచుండునుగాని, అది—ఆఐశ్వర్యము, ఒప్పనిపిమ్మటన్—విడిచిపెట్టినతర్వాత, రూపు—తొంటిరూపము, మాయుగా—నశించిపోవునుగదా, (ఎట్లనఁగా) నిప్పునన్—అగ్నియందు, అంటియున్న—తగిలియున్నటువంటి, అతినిర్మల—మిక్కిలి నిర్మలమయిన, అగ్ని—అగ్నిహోత్రునియొక్క, గురు—గొప్పవగు, ప్రకాశముల్—కాంతులు, తప్పినన్—విడనాడిపోయినను, అట్టిబొగ్గునకున్—అటువంటిచల్లారిపోయిన కట్టెతునకకు, నలుపు—నల్లనికాంతి, తాన్—తాను ఎంతయున్—మిక్కిలి, పుట్టున్—కలుగుచుండును.

తా. బొగ్గు అగ్నిదగ్గరనుండ యున్నప్పుడు ప్రకాశించెడి యగ్నికాంతి, చల్లబడిన తోడనే నల్లనికాంతిఁ గలిగినట్లు, భాగ్యోదయమున్నంతకాలము మానవుఁడు ప్రభఁగలిగి విజృంభించుఁగాని, అది కానరానప్పుడు విరూపమునుఁ గాంచును.

---

21. దినము—ఒకపగలును రాత్రియుఁగలసి దినమనఁబడును. వారమనినను, దినమనినను, దినమునకే యర్థము. రోజు అనువాదుక పదము హిందూస్థాని పదమని యెఱుంగవలెను. శుచి—కాంతి, అందము, మాధుర్యము అని యర్థము.

ఉ॥ ఏగతిఁ బాటుపడ్డఁగల • దే భువినల్పునకున్ సమగ్రతా
భోగము భాగ్యరేఖగల • పుణ్యునకుంబలె భూరిసత్వసం
యోగమదేభకుంభయుగ • యుత్థితమాంసము నక్కకూన కే
లాగుఘటించు సింహము దలంచినఁ జేకుఱుఁగాక భాస్కరా.

టీ. భాస్కరా! ఏగతిన్ = ఏరీతిని (ఏవిధమున) పాటుపడ్డను = కష్టపడుచున్నను, భువిన్ = భూమియందు, అల్పునకున్ = నీచునకు, భాగ్యరేఖ = ఐశ్వర్యలక్షణము, (అదృష్ట చిహ్నము) కలపుణ్యునకుంబలె = కలిగియున్న సుకృతవంతునకువలెనే, సమగ్రతా = పూర్ణమయిన, భోగము = సుఖము, కలదే కలిగియున్నదా, (లేదని యర్థము) కలదు + ఏ = కలదే. అని ఏకారము వ్యతిరేకార్థమున వచ్చియున్నది. (ఎట్లనఁగా) భూరి = ఘనమయిన, సత్వ = సత్త్వము యొక్క, సంయోగ = కూడికఁగల, మద + ఇభ = మదేభ = మదించిన యేనుగు యొక్క, కుంభయుగళీ = కుంభద్వయమందు, ఉత్ + హిత = ఉత్థిత = జనించిన మాంసము = పలలము, సింహము = మృగరాజు, తలంచినన్ = అపేక్షించినను (ఆశించినను) జేకుఱున్ = సిద్ధించునుగాని, (లభించునుగాని) నక్కకూనకున్ నక్కపిల్లకు, ఏలాగు = ఎట్లుగా, లభించును = ప్రాప్తించును, (దొరకదు) సంప్రాప్తము కాదనుట.

తా. మదించిన యేనుగుయొక్క కుంభస్థలములయందున్న మాంసమును మృగరాజుకోరిన లభించునుగాని, ఎంత ప్రయాసపడినను నక్కకు సంప్రాప్తము కానటుల, నైశ్వర్యవంతునకు నపారసౌఖ్యము ప్రాప్తించునుగాని, యెంతకష్టపడినను అల్పునకు దొరకజాలదు.

ఉ. ఏడ ననర్హుఁడుండు నట • కేఁగు ననర్హుఁడు నర్హుడున్నచోఁ
జూడఁగ నొల్లఁడెట్లన న • శుద్ధగుణస్థితి నీఁగపూయముం

గూడినపుంటిపై నిలువఁ • గోరిన యట్టులు నిల్వనేర్చునే
నూడిదవెట్టు నెన్నుదుటిఁచొక్కపుఁ గస్తురిమీఁద భాస్కరా.

టీ. భాస్కరా! అనర్హుఁడు = అర్హతలేనివాఁడు, (చెడ్డవాఁడు) ఏచటనుండునో = ఎచటనుండునో, అనర్హుఁడున్ = అయోగ్యుఁడును, అటవన్ = అప్రదేశమునను, ఏగును = వెళ్లుచుండును, అర్హుడు = యోగ్యతఁగలవాఁడు, ఉన్నచోన్ = ఉన్నస్థలములను, చూడఁగనొల్లఁడు = చూచుటకేని సమ్మతింపఁడు, (ఎట్లన) ఈఁగ = మక్షికము, అశుద్ధ = శుభ్రతలేని, గుణస్థితిన్ = స్వభావసిద్ధము కలదగుటచే, పూయమున్ = చీమును, కూడిన పుంటిపైన్ = కలిగిన కురుపుమీఁద, నిలువన్ = నిలిచియుండుటను, కోరినయట్లు = సమ్మతించినట్లు, నూడిద = కానుకగా, (అనఁగా నలంకారార్థము) పెట్టు = ధరించు, నెన్నుదుటి = నుదుటియందున్న, చొక్కపు = సొగసైన, కస్తురిమీఁదన్ = మృగమదముపైన, నిల్వఁగనేర్చునే = నిలిచియుండఁగలదా? (అనఁగా నిలువలేదనుట)

తా. ఈఁగ, సువాసనఁగల కస్తూరిబొట్టుమీఁద వ్రాలక, చీముతో నిండియున్న పుండుమీఁదనే వ్రాలెడివిధముగా, దుష్టుడు శిష్టునింజేరక, దుష్టాత్మునియొద్దకే పోవుచుండును.

ఉ॥ ఏలసమస్త విద్యల నొ • కించుక భాగ్యముఁ గల్గియుండినన్
జాలు ననేకమార్గముల • సన్నుతికెక్క; నదెట్లొకోయనన్
రాలకునేడ విద్యలు తి • రంబుగ దేవరరూపుచేసినన్
వ్రాలి నమస్కరించి ప్రసవంబులు వెట్టరెమీఁద భాస్కరా.

టీ. భాస్కరా! సమస్త విద్యలన్ = సకల విద్యలతో, ఏల = ఏమియుపయోగము, ఒకించుక = కొద్దిగ, భాగ్యము - అదృష్టము, కల్గిఉండినన్ = కలిగియున్నయెడల, అనేకమార్గములన్ = పెక్కుతెఱంగుల, (పలువిధముల) సన్నుతికిన్ ఎక్కన్ = కీర్తిఁగాంచుటకు, చాలున్ = సరిపడును, అదియెట్లు

ఒకో అనన్=అదియే మార్గమునగా, విద్యలు=చదువులు, రాలకున్=శిలలకు, (కరకురాళ్ళకు) ఏడన్=ఎందున, (విద్యాశూన్యమనుట) తిరంబుగన్=సుస్థిరముగ, దేవరరూపు=దేవతా విగ్రహరూపములుగ, చేసినన్=చేసిన యెడల, (మనుష్యులు) వ్రాలి=భూమికొఱఁగి, నమస్కరించి=వందన మాచరించి, ప్రసవంబులు, కుసుమంబులు, (పుష్పములు) పెట్టరు + ఏ=సమర్పించరె? (ఉంతురని యర్థము.)

తా. శిలులు విద్యల నభ్యసింపకున్నను సుకృతమువలన దేవతారూపములుఁబొంది సమస్తజనులచే పూజానమస్కారములఁ బడయురీతిగా, మనుజులైశ్వర్య సంపన్నులయినవోఁ శెక్కమార్గముల స్తుతింపఁబడుదురుగాని, కేవలము విద్యల నేర్చుకొనుటవలనఁ గాదు.

ఉ॥ ఒక్కఁడెచాలు నిశ్చల బలోన్నతుఁడెంతటి కార్యమైనఁదాఁ
జక్కనొనర్పఁ, గౌరవుల • సంఖ్యలుపట్టిన ధేనుకోటులం
జిక్కఁగనీక తత్ప్రబల • సేన ననేక శిలీముఖంబులన్
మొక్కపడంగఁజేసి తుదఁముట్టఁడె యొక్కకిరీటి భాస్కరా.

టీ. భాస్కరా! నిశ్చల=చలింపని, బల=పరాక్రమము చేత, ఉన్నతుఁడు=అధికుఁడయినవాఁడు, ఒక్కఁడు + ఏ=తానొక్కఁడే, ఎంతటి కార్యము ఐనన్=ఎంతటి ఘనకార్యమైనను, చక్కన్=నేర్పుగా, ఒనర్పన్=నెరవేర్పుటకు (చేయుటకు) ఎట్లనన్; ఒక్కకిరీటి=ధనుంజయుఁడొక్కఁడే, (ఒక అర్జునుఁడే) అసంఖ్యలు=లెక్కింప వీలులేని, కౌరవులు=ధార్తరాష్ట్రిలు, పట్టిన ధేనుకోటులన్=పట్టుకొనిన పశుబృందమును, (గోసమూహములను) చిక్కఁగన్ + ఈక=కౌరవులకుఁ దక్కనీయక, తత్ + ప్రబలసేన=వారల గొప్పసైన్యమును, అనేక శిలీముఖంబులన్=వివిధ బాణములచే, మొక్కపడంగన్ + చేసి=పలాయితులఁగావించి, (జయించి) తుదముట్టఁడు + ఏ=కార్యభారము నెరవేర్పుకొనలేదా? (అనగా నిర్వహించుకొనె ననుట.)

తా. కురువీరులెందరో వచ్చి విరటుని గోవులమందలను దోలుకొని యేఁగుచుండఁగా, వారినెల్లర నర్జునుండొక్కఁడే యోడించి యావుల నన్నింటిని మరలించుకొని వచ్చినటుల; మహాబల పరాక్రమముఁగల వాఁడెట్టి ఘనకార్యమైనను నిర్వహింపఁగలఁడు.

ఉ॥ కట్టడఁదప్పితాము చెడుఁ గార్యముఁ జేయుచునుండిరేని దోఁ
బుట్టినవారినైన విడిపోవుట కార్యము; దుర్మదాంధ్యముం
దొట్టిన రావణాసురునితో నెడబాసి విభీషణాఖ్యుఁడా
పట్టున రాము జేరి చిరపట్టముఁ గట్టుకొనండె? భాస్కరా. 27

టీ. భాస్కరా! కట్టడ=మర్యాద, తప్పి=విడిచి, (వదలి) తాము=మానవులు, ఉండిరి + ఏని=ఉండినయెడల, తోన్ + పుట్టినవారికిన్ + ఐనన్=తనసహోదరులైనను, విడి=వదలి, పోవుట=దూరముగాచనుట, కార్యము=తగినపని, (మంచిపని) దుర్మద + ఆంధ్యమున్=మదమువలన సంభవించిన గ్రుడ్డితనమును, తొట్టిన=కలిగిన, రావణ + అసురునితోన్=రావణుండను దైత్యునితో, ఎడన్ + పాసి=తొలగిపోయి, విభీషణ-ఆఖ్యుఁడు=విభీషణుఁడను నామంబుఁగలవాఁడు, అపట్టునన్=అసమయమునను, రామున్=రాముని చేరి=శరణుఁగోరి, చిరపట్టము=శాశ్వతలంకాధిపత్యము, కట్టుకొనండు + ఎ=పట్టాభిషేకముఁగట్టుకొనలేదా? (కట్టుకొనెనని యర్థము)

---

26. విరటుని కొలువుకూటమునఁ బాండవులజ్ఞాతవాసముఁ గడుపుచుండిరని దుర్యోధనుఁడాలించి, మొదట నిర్ణయప్రకారముఁ బాండవేయుల మరలఁ బదునాలుగువర్షము లరణ్యవాసమునకుఁ బంపవలెనన్న, విరటుని గోగణంబులనుఁ దోలుకొనివచ్చినచో వారు బయల్పడగలరని యూహించుకొన్నవాఁడై, చతురంగ బలంబులతో విచ్చేసి యావులమందలనుఁ దోలుకొని పోవుచుండెను. ఆట్టిసమయమున గడువు చెల్లిపోవుటచే నర్జునుండు, కౌరవుల డీకొని, యోడించి, పశువులనుఁ దోలికొనివచ్చెను.

తా. క్రూరాత్ముఁడగు రావణాసురుఁడు చెడుప్రవర్తనముఁగలవాఁడగుటచే, సోదరప్రేమనుగూడఁ దలంపక విభీషణుండతనినివిడిచిపెట్టి, శ్రీరామునకుఁ బ్రియుఁడై లంకాధిపత్యము వహించినట్లు; దుర్గుణతఁగలవాఁడు సోదరుఁడైనను వానిని విడిచిపుచ్చిన వానికి మేలుకలుఁగును.

27. విభీషణుఁడు=పౌలస్త్యవంశజుఁడు. విశ్రవస్సునకును, కైకసికినిఁబుట్టినమూఁడవకుమారుఁడు. రావణుని తమ్ముఁడు ఇతఁడు సీతాపహరణము తగదని రావణాసురునకు ధర్మోపదేశముఁ జేయగా, నతండువినక, యవమానముఁ గూర్చినందువలన విభీషణుఁడాతనినివదలి రాముని శరణుజొచ్చెను. రాముఁడాతని కభయంబొసంగి, పిమ్మట లంకాధిపతిని గావించెను. ఇతఁడు చిరకాల జీవి.

ఉ॥ కట్టడయైనయట్టి నిజ।కర్మము చుట్టుచువచ్చి యేగతిం
బెట్టునొ పెట్టినట్లనుభ।వింపక తీరదు కాళ్లమీఁదుగా
గిట్టక వ్రేలుడంచుఁ దల।క్రిందుగఁ గట్టిరెయవ్వరైన నా
చెట్టున గబ్బిలంబులకుఁ।జేరిన కర్మముగాక భాస్కరా. 28

టీ. భాస్కరా! కట్టడ=పూర్వోక్తము. (విధియుక్తము) ఐన అట్టి నిజకర్మము=అయినట్టిప్రాకృతకర్మము, చుట్టుచున్=ప్రవర్తింపబడుచు, వచ్చి=చనుదెంచి, ఏగతిన్ పెట్టును + ఒ=ఎట్టియాపదలోఁగూర్చునో, పెట్టిన + అట్లు=అదికలుగఁజేసిన విధముగ, అనుభవింపకతీరదు=పొందకతీరదు. (ఎట్లనగా) ఆ చెట్టునన్ గబ్బిలంబులకు=ఆవృక్షమునఁ దలక్రిందుగా వ్రేలాడు తైలపాయికలకు. (గబ్బిలములకు) చేరినకర్మముకాక=వచ్చిన పూర్వకర్మసంచితముఁగాక, ఎవ్వరు + ఐనన్=ఏమనుజులైనను, కిట్టక=నోర్వలేక, కాళ్లమీఁదుగాన్=తలక్రిందుగాను, వ్రేలుఁడు=వ్రేలాడుచుండుడు. అంచున్=అని చెప్పుచు, కట్టిరె=బంధించిరా, (కట్టలేదని యర్థము).

తా. గబ్బిలములను తలక్రిందగా వ్రేలాడుమని పరులెవ్వరు బంధింప కపోయినను, తమ పూర్వజన్మసంచిత ప్రారబ్ధమున నావిధముగ వ్రేలాడు చున్నటులఁ విధినిర్ణీత మెట్లుండునో మానవుడట్లు నడువక తప్పదు.

ఉ॥ కట్టడ లేనికాలమునఁ।గాదు శుభంబొరు లెంతవారు చే
పట్టిననైన మర్త్యునకు।భాగ్యము రాదను టెల్లగల్ల కా
దెట్టనిపల్కినన్ దశర।థేశ వసిష్ఠులు రామమూర్తికిన్
బట్టముఁగట్టఁగోరి రది। పాయక చేకుఱెనోటు భాస్కరా. 29

టీ. భాస్కరా! మర్త్యునకున్=మనుజునకు. కట్టడ=విధినియమము, లేనికాలమునన్=లేనట్టి సమయమందు, శుభంబు=మంగళప్రదము, కాదు=కా నేరదు, ఒరులు=అన్యులు, ఎంతవారు=ఎంతటి ఘనమయినవారు, చేపట్టినన్ + ఐనన్=దగ్గిరఁజేర్చుకొనినప్పటికిని, భాగ్యము=సంపద, రాదు=చేకూరదు (కలుగదు,) అనుట + ఎల్లన్=అని చెప్పెడిదంతయు, కల్లగాదు=మృషకాదు, (అసత్యము కాదు.) ఎట్లు + అని=ఏప్రకారము గానని, పల్కినన్=నుడివినవో

---

29 దశరథుడు=సూర్యవంశపురాజు. అజమహారాజు కుమారుఁడు. తొల్లి, దేవాసురయుద్ధమునందు, సురలకు సాయంబుచేయఁబోయి, శంబరుఁ డను రాక్షసునితోఁ పోరు సమయంబున, రక్కసమాయలకు నుక్కుదక్కియు న్న దశరథరాజునకుఁ, కైకేయి తోడుపడి, ధవళాంగుఁడను మునీశ్వరుఁడొసఁ గిన మంత్రవిద్యచే శంబరాసురుని మాయోపాయము లణఁగింప, నారాజేం ద్రుఁడామెను మెచ్చుకొనుచు వలయు వరంబులు వేడుకొన మనఁగా, నా పె రెండు వరంబులు వడసి సమయమున కిచ్చునట్లొప్పగించుకొనెను. అవరమ లె రాముని పట్టాభిషేక సమయంబున, నొకటి రామచంద్రునకు వనవాస మును, రెండు భరతుని పట్టాభిషేకమును కైకకోరఁగా, దశరథుఁడు మా

దశరథేశవసిష్ఠులు=దశరథరాజును, వసిష్ఠమహర్షియు, రామమూర్తికిన్=రామునకు, పట్టముకట్టన్=పట్టాభిషిక్తునిఁజేయుటకు, కోరిరి=ఇష్టపడిరి. అది=అపట్టాభిషేకము, పాయక=విఘ్నముఁగాకుండ, చేకూరెన్ + ఓటు=జరిగినదా జరుగ లేదనుట.)

తా. రాముని పట్టభద్రునిఁజేయుటకై దశరథ వశిష్ఠాదులెంత శ్రమపడినను, నిష్ఫలమగునట్టుల, అదృష్టము లేని మానవునకు శుభములు కలుగవు. ఎట్టిధనవంతుఁడు ప్రయత్నించి దరిఁజేర్చుకొన్నను సంపదలురావు.

---

ర్భాగతుఁడయ్యెను. అంత, మీతండ్రియాజ్ఞగా వనవాసమునకుఁ బొమ్మని కైకేయి రామునకుఁ జెప్పెను. శ్రీ రాముఁడట్లొనర్చెను. వెంటనే దశరథుడు కాలధర్మమునొందెను:—దశరథుని శాపకారణము.—ఒక మునికుమారుఁడు అంధులగు జనని జనకుల తృష్ణదీర్పఁ దటాకమునకేగి కమండలముతో జలము ముంచుచుండఁగా, వేటాడుచుండిన దశరథరాజా నీళ్ళచప్పుడాలించి, మదగజమను భ్రాంతిచే శరాసనంబుఁజేఁబూని బాణము సంధించి విడిచెను. ఆ బాణము మునిపుత్రునిదాఁకుటచే వెంటనే హా! యని ప్రాణములు విడిచెను. అంతనా మహారాజు తన తప్పిదమునుఁ దెలిసికొన్నవాడై, భయాకులచిత్తంబున నా వృద్ధదంపతుల చెంతకేగి, ఋషిబాలుని వృత్తాంత మావంతయు నివేదించెను. పాపమా వృద్ధదంపతులు పుత్రశోకమును భరింపలేక, రాజునుఁ గాంచి, నీవును, మావలెనే పుత్రశోకార్తిచేఁ జచ్చెదవుగాకయని శపించి, వెంటనే మృతినొందిరి:—వసిష్ఠుని జన్మవృత్తాంతము.— వసిష్ఠుడుఁ బ్రహ్మమానస పుత్రులలో నొకఁడు. మహాతపశ్శాలి. అర్కవంశజులకుఁబురోహితుఁడు. అరుంధతి వీనిభార్య. ఇతనికి నూరుగురు కుమారులు. సుతశతంబును, విశ్వామిత్రుఁడను రాజఋషి నాశనము జేసెను. ఈతండు దక్షప్రజాపతి తనూజయగు ఊర్జనువివాహామాడి రజుఁడు, గోత్రుఁడు ఊర్ధ్వబాహు

ఉ॥ కానక చేరఁబోల రతికర్ముఁడునమ్మిక లెన్ని చేసినన్
దానదినమ్మి వానికడ • డాఁయగబోయిన హానివచ్చు న
చ్చోనదియెట్లనం గొఱకు •చూపుచునొడ్డినబోను మేలుగా
బోనని కాన కాసపడి•పోవుచుఁగూల దెకొక్కు-భాస్కరా 30

టీ. భాస్కరా! అతికర్ముఁడు=పాపపు కార్యముల సేయువాఁడు. ఎన్నినమ్మికలు, మిక్కిలి విశ్వాసములు, చేసినన్ - చూపించినను, కానక= యోచింపక, చేరఁ + పోలగు=దగ్గఱకేగరాదు. తాన్=తాను, (మనుజుఁడు అది. నమ్మి—అంగీకరించి, (విశ్వసించి) వానికడన్ - ఆ పాపియున్న తావును, డాయగన్=చేరగను, పోయినన్ =వెళ్లినన్, అచ్చోన్ - అస్థల మందు, హాని-ఆపత్తు, (కీడు) వచ్చున్=సంప్రాప్తమగును. అదిఎట్లనన్= అదియేప్రకారమనగా, కొక్కు=పందికొక్కు, కొఱకు=మేతను, చూపు చున్=కనఁబఱచుచు, మేలుగాన్=మంచిగను, ఒడ్డిన= పన్నిన, బోనును=జం తువులను బంధించెడి యంత్రమును, (బోనుఅని,) తన్ను జంపఁగానునిచినయం త్రమని, కానక, తెలిసికొనలేక, ఆసపడి, అపేక్షఁగలిగి, పోవుచున్=నడ చుచు, (అందున ప్రవేశించి) కూలదె=మృతిఁజెందదా? (చచ్చుననియర్థము.)

---

వు, పవనుఁడు, అనఘుఁడు, సుతశిపుడు, శుక్రుఁడు, అను యేడుగురు పుత్రుల నాపెయందుఁ బడసెను. ఆసుతసప్తకంబును స్వాయంభువ మన్వంతరమున సప్తర్షులగనుండి యున్నారు. పూర్వమీతఁడుఁ బ్రహ్మమానస పుత్రు డైనను, నిమియనుఋషిశాపముచేత, వొల్లింటిశరీరమునకు నాశనముగలుగుట వలన , తిరిగి మిత్రావరుణులకు జన్మించెను, ఒకానొక సమయమున, మి త్రావరుణులకు, యూర్వసినిఁ గాంచినప్పుడు రేతస్ఖలితమాయి నప్పుడది యొకకుంభమునందుఁ జేర్పఁబడఁగా, నందునుండి యగస్త్యుడును, వసిష్ఠుడు జన్మించిరి. అందుకతన వీరిరువురు కుంభసంభవులని పేర్కొనఁబడిరి.

తా. తన్ను జంపుకొఱకు నొడ్డినబోను యందుఁగల పదార్థమున కాసించి, నిజము గ్రహింపలేక, నందుఁజొచ్చి, మృతిఁజెందు, పందికొక్కు విధముగ; పాపాత్ముఁడు నమ్మికలెన్ని వక్కాణించినను, చెంతఁజేరరాదు. అటులఁజేరిన, దప్పక హానికలుగును.

ఉ॥ కాని ప్రయోజనంబు సమ • కట్టదు తా భువి నెంతవిద్య వా
డైనను దొడ్డరాజుకొడు • కైనన దెట్లు మహేశుపట్టివి
ద్యానిధి సర్వవిద్యలకు • దానె గురుండు వినాయకుండు దా
నేనుఁగురీతినుండియున • దేమిటికాఁడఁడు పెండ్లి భాస్కరా 31

టీ. భాస్కరా! భువిన్ = భూమియందు, తాన్ = తాను, ఎంతవిద్యావాఁడు + ఐనను = ఎంతటి విద్యకలవాఁడైనను, దొడ్డరాజు కొడుకు = గొప్పభూపతియొక్క, పుత్త్రుఁడు ఐనన్ = అయినప్పటికిని = కాని ప్రయోజనంబు = అనుకూలపడని, కార్యము, సమకట్టదు, నెఱవేరదు, అది + ఎట్లనగా మహేశుపట్టి = ఈశ్వరునికొడుకు, విద్యానిధి = చదువుల కునికిపట్టు, సర్వవిద్యలకున్ = అన్ని చదువులకు, తాన్ = తానొక్కఁడే, గురుండు = ఒజ్జ, వినాయకుండు = అయినట్టిగణనాథుఁడు, తాన్ = తాను, ఏనుగురీతి = గజమువలెనే, ఉండియున్ = (అనఁగా ఏనుగంతజవసత్త్వముఁగలవాఁడయి యున్నప్పటికిని, పెండ్లి = వైవాహికము, ఏమిటికిన్ = ఏహేతువుచేత, ఆడఁడు = చేసికొనఁడు.

తా. ఈశ్వరపుత్త్రుండును, సర్వవిద్యలకధినాథుండును, అందరకునుపదేశకుఁడును, ఏనుగంత బలపరాక్రమముఁగలవాఁడైనను వివాహమాడలేక పోయినటుల; లోకములో మనుజుఁడెట్టివిద్వత్తుగలవాఁడైనను, మహారాజకుమారుఁడైనను, ఈశ్వరానుగ్రహములేని కార్యమును జేసికొనలేఁడు.

ఉ॥ కామితవస్తుసంపదలు • గల్గుఫలం బొరు లాసపడ్డచో
నేమియుఁ బెట్టఁడేని సిరి • యేటికి నిష్ఫల మున్నఁబోయినన్
భ్రామికపడ్డ లోకులకుఁ • బండఁగనే మది యెండిపోవఁగా
నేమిఫలంబు? చేదు విడ • దెన్నటికైన ముసిండి భాస్కరా.

టీ. భాస్కరా! ఒరులు=ఇతరులు, కామితవస్తుసంపదలు = కోరిన పదార్థములయొక్క సంపత్తులు, కల్గుఫలంబు=కలిగిన ఫలమును, ఆసపడ్డచోన్=కాంక్షించినప్పుడు, ఏమియున్=ఇంచుకంతయు, పెట్టఁడేని=(ధనవంతుఁడు) ఒసంగకపోయెనేని, సిరి=లక్ష్మి, (సంపదలు) ఏటికిన్=ఎందులకు, ఉన్నన్=ఉన్నప్పటికిని, పోయినన్=పాడయిపోయినప్పటికిని, నిష్ఫలము=ప్రయోజనములేనిది. ముసిండి=ముష్టిచెట్టు, ఎన్నటికైనన్=ఏనాటికైనను, చేదు=విసమును, విడదు=విడువదు, అది=అట్టిముసిణిచెట్టు=పండగన్ + ఏమి=ఫలించిననేమి, ఎండిపోవఁగాన్=ఎండి పడిపోవునప్పుడైనను, భ్రామికపడ్డ లోకులకున్= భ్రాంతిజెందిన మనుజులకు, ఏమిఫలంబు=ఏమియును లాభము లేదు.

తా. ఎంతకాలమైనను ముసిఁడిచెట్టు చేదును విడువనప్పుడా చెట్టు పండినను, యెండినను భ్రాంతిచే దాని నాశ్రయించువారలకు లాభములేనట్టులే ధనవంతుఁడు తన్నుగొల్చెడి యర్థుల నాదరింపఁడేని, వాని సంపదలు న్నను, యూడినను నొకటియే.

ఉ॥ కారణమైన కర్మములు • కాక దిగంబడవెన్ని గొందులం
దూఱిన నెంతవారలకుఁ; • దొల్లిపరీక్షితు శాపభీతుఁడై
వారిధినొప్పు నుప్పరిగ • పైఁ బదిలంబుగ డాఁగియుండినన్
గ్రూరభుజంగదంతహతిఁ • గూలఁడె లోకులెఱుంగ భాస్కరా.

టీ. భాస్క! ఎన్నిగొందులన్=ఎన్ని సందులలో, దూరినన్ = దాగి యుండినను, ఎంతవారలమన్=ఎట్టిమహాత్ముల మను, కారణము=హేతువు, వికర్మముల్=అగుకర్మములు, కాక=అనుభవముఁగాకుండ, దిగంబడవు=నాశనము కావు, (ఎట్లన) తొల్లి=పూర్వమున, (కలియుగారంభమున) పరీక్షితు=పరీక్షిన్మహారాజు, శాపభీతుఁడై=శాపమువలనభయభ్రాంతుఁడై, వారిధిన్=కడలియందు, ఒప్పు=ఒప్పుచున్న, ఉప్పరిగపైన్=సౌధముపైన, పదిలంబుగన్=భద్రముగా, డాగియుండినన్=దాగికొనియున్నను, ప్రహర=భయప్రదపైన, భుజంగ=మండలియొక్క, (పన్నగముయొక్క) దంత=కోఱలయొక్క, హతిన్=దెబ్బచేత, లోకులు=ప్రజలు, ఏఱుంగన్ = తెలిసికొనునట్లుగా, కూలఁడు + ఏ=ప్రాణములఁగోలుపోవఁడా? (అనగాఁజెప్పెననుట.)

తా. పరీక్షిన్మహారాజు మునీశ్వరుఁ శాపభీతిచే సముద్రమధ్యమున మేడగట్టించుకొని డాగియుండినను సర్పదష్టుఁడైనటుల; నెంతటివారైననుఁ దామనుభవింపవలసిన కర్మములు దాట నెందుఁజొచ్చినను, ననుభవింపక తీరదు.

---

43. పరీక్షిత్తు= అభిమన్యునకు నుత్తరయందుఁ బుట్టినకుమారుఁడు. ఇతని తాత అర్జునుఁడు. కురు, పాండవయుద్ధానంతరమున రాజయ్యెను. ఒకానొక సమయంబున నితండు వేటకుఁబోయి, మార్గములో నొకముని నిష్ఠయందుఁ గూర్చుండగా, నటఁచచ్చిపడియున్న పన్నగము నాతని మెడలో వైచెను. పిమ్మట, నాఋషిపుత్రుఁ డదివిని, యిట్టిపాపకార్య మాచరించిన దురాత్ముఁడు నేటి కేడవదినంబున పాముచేఁ జచ్చుఁగాకయని శపింపఁగా, పరీక్షిత్తు దద్దానికి భయపడి, నడిసముద్రమున నొకమేడనిర్మించుకొనియందుండఁగా నట నొకబ్రాహ్మణుఁ డొసఁగిన ఫలంబును వాసనఁజూచుచుండ, నాఫలము పాముగామారి వానిని గఱచి చంపెను.

చ॥ కులమునఁ జక్కఁడక్కడ నమంత్రిత ధార్మికుఁ డొక్కఁ డొక్కఁడే
కలిగెడుఁ గాక పెంపెఱుచు • కల్గఁగ నేరరు, చెట్టుచెట్టునన్
గలుగఁగ నేర్చునే గొడుగు • కామలు చూడఁగ నాడనాడ నిం
పలరఁగ నొక్కొకొక్కటిన • యంబునఁ జేకుఱుఁ గాక భాస్కరా

టీ. భాస్కరా! అమంత్రిత ధార్మికుఁడు=వెనుకాడని ధర్మబుద్ధిఁగలవాఁడు, కులమునన్=వంగడమందు, అక్కడక్కడన్=ఒక్కొక్కస్థలమునందుఁ ఒక్కఁడొక్కఁడే=ఒక్కొక్కఁడే, కలిగెడుఁగాక=ఉండునుగాక, పెంపెఱుచు=మిగులయధికముగా, కల్గనేరరు=కలిగియుండరు, చూడఁగన్=విచారింపఁగా, గొడుగుకామలు=గొడుగుకఱ్ఱలు, అడనాడన్=అందందున, ఇంపు + అలరన్=ఒప్పారితగా, నయమునన్=తిన్నగా, ఒక్కొక్కటి=ఒక్కొక్కటియే, చేకుఱున్ + కాక=ప్రాప్తించునుగాక, చెట్టుచెట్టునన్=ప్రతిచెట్టుయందును, కలుగఁగనేర్చునే + ఎ=సంభవించునా? (అనఁగా ఉండదనుట.)

తా. ఛత్రమునకు సమర్థమైనదగిన తిన్ననికఱ్ఱ లెక్కడనో యొక్కచెట్టున నుదయించునుగాని, ప్రతివృక్షమునందును వంకరలేనివి లభింపనట్లే మంచిబుద్ధిఁగలవా డెక్కడనో యొక్కఁడు వంగడమందు జనించును గాని, తఱుచుగా నుండడు.

ఉ॥ క్రూర మనస్కులయిన పతులఁ గొల్చి వసించిన మంచివారికిన్
వారిగుణంబె పట్టి చెడు। వర్తన వాటిలు; మాధురీజలో
ధారలు గౌతమీముఖ మహానదులంబుధిఁ గూడి నంతనే
క్షారముఁ జెందవే మొదలి। కట్టడలన్నియుఁదప్పి భాస్కరా!

టీ. భాస్కరా! క్రూరమనస్కులు=కఠినమతులు, ఔ+ పతులన్=అయినట్టి రాజులను, కొల్చి=సేవించి, వసించిన మంచివానికిన్=ఉన్నట్టి

యోగ్యులను, వారిగుణంబె=ఆరాజుల దుస్స్వభావమే, పట్టి=అభ్యాసపడి. చెడువర్తన=చెడ్డనడవడి, పాటిలుఁ=సంప్రాప్తమగును, (ఎట్లన) మాధురీ=మాధుర్యముతోఁగూడిన (తియ్యదనముతోఁగూడిన) జల=నీటిచేత, ఉదారలు=ఘనమగు, గౌతమీ=గోదావరి, ముఖ=మొదలుగాగల, మహానదులు=మిక్కిలి గొప్పనదులు, అంబుధిఁ=సాగరమును, కూడినంతనె=సంగమమైనయంతనె, (కలిసినమాత్రముచేతనే) మొదలికట్టడలు + అన్నియుఁ=తొలుతఁగల మాధుర్య గుణాగుణములన్నియు, తప్పి=విడిచి, క్షారముఁ=ఉప్పదనమును, చెందవు + ఎ=పొందవండునా? (పొందునని యర్థము.)

తా. మధురములగు జలముతో నొప్పారెడి మహానదులన్నియు సముద్రమునఁ జేరినంతనే తొల్లింటిరుచులఁ బోవిడిచి యుప్పదనమందు విధముగాఁ గఠినకర్ముఁడగు రాజునుఁ గొల్చెడి మంచివారుగూడ, తమ తమ సద్గుణంబుల విడనాడి యాభూమిపతి దుర్గుణంబులను, బొంది దుర్మార్గవర్తనులగుదురు.

ఉ॥ గిట్టుటకేడఁ గట్టడ లి। ఖించిన నచ్చటఁగాని యొందుచోఁ
బుట్టదుచావు; జానువుల। పున్కలనూడిచి కాశిఁజావఁ గా
లట్టిన శూద్రకుఁ భ్రమలఁ। గప్పుచుఁ దద్విధి గుట్టుమాచునా
పట్టునఁగొంచు మట్టికడఁ। బ్రాణముదీసెఁగదయ్యభాస్కరా,

టీ. భాస్కరా! గిట్టుటకుఁ=మృతిజెందుటకు, ఎడఁ=ఎక్కడ, ట్టడ=నియమము, లిఖించినఁ=(నలువ) వ్రాసినయెడల, అచ్చటఁ + ాని=అప్రదేశమందకాని, ఒండుచోఁ=వేఱొకస్థలమందు, చావు=మృతి, ట్టదు=సంప్రాప్తముకాదు (కలుగదు) ఎట్లనఁగా; కాశిఁ=కాశీపట్టణనందు, చావఁ=చనిపోవుటకు, జానువుల=మోకాళ్ళయొక్క పున్కలఁ=ప్పలను, ఊడిచి=ఊడదీసికొని, కాలట్టిన శూద్రకుఁ=కృతనిశ్చయుఁడైన

శూద్రక మహారాజు, భ్రమలన్=మాయలచే, కప్పుచున్=సమీపించుచు,
తత్ + విధి=ఆదైవము, గుఱ్ఱము + ఔచున్=ఒకతురగము రూపమును దాలి
చి, అప్పటునన్=అసన్నకాలము సమీపించు వేళను, కొంచున్= తనపైన
నెక్కించుకొని పోవును, మఱ్ఱికడన్= ఒకమఱ్ఱివృక్షమునొద్ద, ప్రాణమున్
=జీవమును, తీసెన్ + కద + అయ్యా=తీసెను గదా.

తా. శూద్రకుఁడను మహారాజు కాశీక్షేత్రమునఁ బాపసంసిద్ధుఁడై
తనమోకాలి చిప్పల నూడదీసికొని, యచ్చటనె వసించియుండగా, దైవ
మొక గుఱ్ఱమై, వానిని తనవీపుమీద నెక్కించుకొనిపోయి, యొకమఱ్ఱివృక్ష
ముకడఁ బ్రాణముదీసెను. కావునఁ, జచ్చుట కేస్థలంబున విధి విధించెనో,
యచ్చటఁగాక మఱియొండు చోటున మృతినొందఁడు.

చ॥ ఘనబల సత్త్వమచ్చుపడఁ । గలిగినవానికి హాని లేనిచోఁ
దనదగు సత్త్వమే చెఱుచుఁ దన్ను: నదెట్లన? నీరులావుగాఁ
గనువసియించినన్ జెఱువు!కట్టకు సత్త్వము చాలకున్నచోఁ
గనుమలుపెట్టి నట్టనడి।గండి తెగంబడకున్నె భాస్కరా. 32

టీ. భాస్కరా! ఘనబలసత్త్వము=మిక్కిలి బలముతోఁ గూడిన సత్తు
వ, కల్గినవానికిన్=కలిగియున్నమానవునకు, హాని=చేటు, (కీడు) లేనిచోన్
=(ఇతరులవలన) లేకున్నను, తనది=తన సంబంధమైయున్నది. అగు సత్త్వ
ము=అయినట్టి బలము తన్నున్=తన్ను, చెఱుచున్=చెడఁగొట్టును. అది +
ఎట్లు + అనన్=అది యేవిధముగాననగా, నీరు=ఉదకము, లావుకాన్ +
కన్=అధికముగ, వసించినన్=ఉండినప్పుడు, చెఱువుకట్టకున్=కొలనుగట్టు
నకు, సత్త్వము= సత్తువ (బలము) చాలకున్నచోన్=సరిపోవకున్నచో, కను
మలు= సందులు, పెట్టి=పడి, నట్టనడిగండి=ఆచెఱువుగట్టున మధ్యబిలము,
తెగంబడక, తెగకుండ, ఉన్నె=ఉండునో. (ఉండని యర్థము)

తా. కొలనులో జలమెక్కువగా నున్నప్పుడు చెఱువుగట్టునను బలములేనియెడల నడుమనుండిన గండి తెగిపోవునట్లుగా, తాను బలరాక్రముఁ డగుటచే నితరులవలన హానికలుగకున్ననుఁ దనసత్తువయేఁ దన్ను నాశనము జేయును.

చ॥ ఘనుఁడగు నట్టివాఁడు నిజ।కార్య సముద్ధరణార్థమై మహిం
బనివడి యల్పమానవుని । బ్రార్థనచేయుట తప్పుగాదుగా;
యనఘత కృష్ణజన్మమున ।నావసుదేవుఁడు మీఁదఁబెత్తుగా
గనుఁగొనిగాలిగానికడకాళ్లకు।మొక్కఁడెనాడుభాస్కరా ౩౮

టీ. భాస్కరా! ఘనుఁడు=అధికుఁడు, అగునట్టివాఁడు=అయినట్టి మనుష్యుఁడు,నిజ=తనయొక్క=కార్య=పనిని, సముద్ధరణ + అర్థము=నెరవేర్చు కొనుటకై, మహిన్=ధరయందు, పనివడి=ప్రయత్నముచేసి, అల్పమానవు నిన్=నీచమలజుని, ప్రార్థనచేయుట=స్తోత్రముసేయుటఁ తప్పుకాదుకా=నేర ముకాదుగదా, (ఎట్లనగా) కృష్ణజన్మమునన్= శ్రీకృష్ణ జననకాలమున,

---

38 వసుదేవుఁడు:— దేవకీదేవిభర్త. శ్రీకృష్ణ బలరాములకుఁ దండ్రి కంసరాజునకు బావమఱఁది దేవకీదేవి యష్టమగర్భమునందుదయించిన వాఁడు తనప్రాణంబు లపహరించునని కంసుఁడు దేవకీవసుదేవుల ఖైదుజేసెను. పుట్టినబిడ్డలనెల్లఁ దనపాట్టఁ బెట్టుకొను చుండెను. పిమ్మట నష్టమ గర్భంబున శ్రీకృష్ణుఁడవతరించెను. తండ్రియగు వసుదేవుఁడాబిడ్డను సం రక్షింపఁ జేరువనున్న ద్రేపల్లెకుఁ బోవుసమయమున, కంసరాజాజ్ఞను, ద్వారమునఁగాపుపెట్టిన గాడిదను గాంచి, కార్యభంగమగు నేమోయని, దానికడ కాళ్ళను నమస్కరించి, సఫలీకృత మనోరథుఁడయ్యెనని పుక్కిటపురాణంబుగాఁ జెప్పుకొను చుందురుగాని, వేదములఁ గనబడదు.

అనఘుతన్=నిర్మల హృదయముచేత, ఆ వసుదేవుఁడు=కృష్ణునిగన్న తండ్రి యగు, వసుదేవుఁడు,మీదటెత్తుగాన్=జరుగఁబోవు కార్యమునకు పన్నుగడ గా, కనుఁగొని=తలఁచి, నాఁడు=తొల్లి, గాలిగాని కడకాళ్ళకున్=గాడిద యొక్క వెనుకపాదములకు, మ్రొక్కఁడు + ఏ=నమస్కారింపలేదా (అన గా నమస్కారించె ననుట)

తా శ్రీకృష్ణుఁడవతరించఁగా నతనికిఁగంసునివలన హాని లేకుండ వ్రేపల్లెకుఁ గొనిపోవుచు, కార్యము విఘ్నముఁగాకుండు నటుల గాడిదకాళ్లకు వసుదేవుఁడు నమస్కారించిన విధముగా, లోకంబున మానవుఁడు స్వకార్య నిర్వహణార్థమునకొక నీచునిఁ బ్రార్థించినను, గౌరవమునకు హానిలేదు.

చ॥ ఘనుఁడొకవేళఁగీడ్పడినఁ • గ్రమ్మఱ నాతని లేమివాపఁగా
గనుఁగొననొక్కసత్ప్రభువు •గాక నరాధములోపరెందఱుం
బెనుఁజెఱువెండినట్టి తఱి • బెల్లునమేఘుఁడుగాక నీటితోఁ
దనుపఁదుషారముల్ శతశ•తంబులుచాలునటయ్య భాస్కరా

టీ భాస్కరా! ఒకవేళన్=ఒకకాలమందు, ఘనుఁడు=అధికుఁడు కీడ్పడినన్=హానిఁజెందినచో (పేదయైనచో) క్రమ్మఱన్=తిరిగి, అతని లేమి=అతని పేదఱికము, వాపగాన్=బాపుటకు, (పోగొట్టుటకు) ఒక్క సత్ప్రభువుగాక=మహారాజుగాక, నర + అధములు=నీచమానవులు, ఎంద ఱున్=చాలమందియయినను, ఓపరు=తగరు, ఏట్టులనగా:— పెనుచెఱువు, గొప్పతటాకము, ఎండిన + అట్టితఱిన్=నీరెండిపోయిన సమయమున, పెల్లు నన్=తత్క్షణమె, నీటితో=ఉదకముచేత, తనుపన్=నిండించుటకు, మేఘు ఁడుగాక=మేఘములుగాక, తుషారముల్=మంచు తుంపరులు, శతశతంబులు నూఱులైనను, చాలునటయ్య=సరిపోవునా? (సమర్థములు కావని అర్థము.)
తా॥ ఒక గొప్పచెఱువు యెండిపోయినప్పుడు, మరలవానిని నిండింపవలెనన్న

మేఘశకలము తగుగాని,మంచుబిందువు లెన్నియయినను,ప్రయోజనము లేనటుల; విధివశమున గొప్పవానికి పేదఱికము సంభవించినచో నట్టిదానిని తొలఁగింప గొప్ప రాజేంద్రునకుఁ దగుఁగాని, తుచ్ఛమానవు లెందఱున్నను బాగుచేయ నసమర్థులు.

ఉ॥ చంద్రకళావతం సకృప • చాలనినాఁడుమహాత్ముఁడైనఁదా
సాంద్రవిభూతిబాసియొక • జాతివిహీనునిఁగొల్చియుంటయో
గీంద్రనుతాంఘ్రిపద్మమతి • హీనతనొందుట కాదుగా హరి
శ్చంద్రుడువీరబాహునిని•జంబుగఁగొల్వఁడెనాఁడుభాస్కరా.

టీ॥ యోగీంద్ర=మునీశ్వరులచేత. నుత=స్తుతింపఁబడు. అంఘ్రి

---

40 హరిశ్చంద్రుడు=త్రిశంకునందనుఁడు. రవికులజుఁడు, నవఖండ మండలాధిపతి, భార్య చంద్రమతి. కుమారుఁడు లోహితాస్యుఁడు. మంత్రి సత్యకీర్తి, అయోధ్యా పురాధీశ్వరుడు. ఇతఁడు యజ్ఞార్థము విశ్వామిత్రునకు ధనంబొసగ వాగ్దత్తముచేసి యుండెను. దేవేంద్రుని సమక్షము న ప్రతినఁబూనిన విశ్వామిత్రుఁడు: తన ప్రతిజ్ఞా పరిపాలన సేఁతవేర్పు కొనుటకై, మాలకన్నియలను వివాహమాడ వలసినదిగా హరిశ్చంద్రుని నిర్బంధింప, రాజేంద్రుడంత పదచ్యుతికైనను నొప్పుకొనును గాని యా కన్నియల వరింపనని భీష్మించెను. ఆ మిషచే మునీశ్వరుఁడు రాజును రాజ్యభ్రష్టుగావించి, యజ్ఞార్థమొసంగిన ధనంబుగూడ నిచ్చి పొమ్మని పలికెను. రాజువల్లెయని, సతీ, సుతసమేతముగా కాశీపురముజేరి, భార్యయగు చంద్రమతీదేవి యొక్క నొక భూసురునకు విక్రయించి తానొక మాలవాసికమ్ముఁబడిబుణ విముక్తుడై కొంతకాలము చండాలవాని దాస్యం బొనరించి, పిమ్మటమహేశ్వరానుగ్రహ మున, సుత, సతీసమేతముగ మరల తన రాజ్యాదిభోగములఁ గైకొనెను.

పద్మ=పాదపద్మములు, గలవాఁడ, భాస్కరా! మహాత్ముఁడు + అయినన్=గొప్ప మనుజుఁడైనను, చంద్రకళా + అవతంసుకృప=శశిరేఖశిరోభూషణముఁగాగల మహేశ్వరునియొక్క దయ, చాలనిఁ నాఁడు=లేనికాలమందు, తాన్=ఆ మానవుఁడు, సాంద్రవిభూతిన్=ఘనమైన సంపదను పాసి=వదలి ఒకజాతి విహీనునిన్=ఒక నీచ కులోద్భవుని, కొల్చిఉండుట=సేవించియుండుట, మతివిహీనత=తెలివిలెమి. కాదుగా=కాదు. గదా, నాఁడు=తొల్లి (కృతయుగము నందు) హరిశ్చంద్రుఁడు=హరిశ్చంద్ర మహారాజు. వీరబాహునిన్=వీరబాహుఁడను చండాలుని, నిజంబుగన్=నిశ్చయముగ, కొల్వఁడు + ఏ=కొలువలెదా? (సేవించెనని యర్థము).

తా హరిశ్చంద్రుఁడు మహారాజైనను, యీశ్వరానుగ్రహము లెనికతన. వీరబాహుఁడను మాలవానినిఁ గొలిచినటులు; భగవత్కృప లేని సమయమున. నెంతటి గొప్పవాడైనను సంపదలఁగోలుపోయి నీచు నొక్కని సేవించుట. నిజము అదియొక బుద్ధిమాంద్యముకాను.

ఉ॥ చక్కఁదలంపఁగా విధివ • శంబున నల్పునిచేతనైనఁ దా
జిక్కి యవస్థలుంబొరలుఁ • జెప్పఁగరానిమహాబలాఢ్యుఁడున్
మిక్కిలి సత్వసంపదల • మీఱినగంధగజంబు మావటీఁ
డెక్కియదల్చి కొట్టికుది•యించినుండదెయోర్చిభాస్కరా. 4

టీ. భాస్కరా! చక్కన్=బాగుగా, తలంపన్=విచారింపగా, చెప్పన్=నుడువుటకు (చెప్పుటకు) రాని మహాబలాఢ్యుఁడున్=అపార బలముఁగలవాడయినను, తాన్=తాను, విధివశంబునన్=దైవ వశముచేత, అల్పునిచేతన్ + అయినన్=తుచ్ఛుని చేతిలోనైనను, చిక్కి=తగులుకొని (చిక్కుపడి) అవస్థలన్=కష్టములను, పొరలున్=కలుగుచుండును, ఎట్లన:- మావటీడు=గజమును సాకువాఁడు, ఎక్కి=దానిమీదకూర్చుండి, అదల్చి=

భయపెట్టి, కొట్టి=అంకుశములతోఁబొడిచి, వదియించినన్=లొంగునట్లు, చేసినప్పటికిని, మిక్కిలి=అధికమగు, సత్వసంపదలన్=బలసమృద్ధిచేత, మీఱిన=పరాక్రమించిన, గంధగజంబు=మదించినయేనుఁగు, ఓర్చి=సహించి, ఉండదు + ఎ=ఉండలేదా? (ఓర్చియుండునని యర్థము)

తా. మిగుల సత్త్వఁగల మదపుటేనుగు, మావటీఁడు తనపై నెక్కి-కూర్చుండినను, అదలించినను, అంకుశముతోఁ బొడచుచువఁగఁ జేసినను,వాని నన్నింటి నోర్చుకొనినట్లే; ఎంతటి బలాధిక్యతఁగల వాడైనను విధివశమున, నల్పునిచే జిక్కి దురవస్థలఁ బొందుచుండును,

చ॥ చదువది యెంతఁ గల్గిన, ర • సజ్ఞత యించుక చాలకున్న నా
చదువు నిరర్థకంబు గుణ • సంయుతు లెవ్వరు మెచ్చ రెచ్చటం
బదనుగ మంచికూర నల • పాకము చేసిననైన నందు నిం
పొదవెడు నుప్పు లేక రుచి • పుట్టఁగ నేర్చునటయ్య భాస్కరా 42

టీ. భాస్కరా! చదువుఅది=విద్య, ఎంతకల్గినన్=ఎంతయెక్కువ యున్నప్పటికిని, రసజ్ఞత=సారము సంగ్రహించుట, ఇంచుక=కొంచెము, ఎచ్చటన్=ఎందైనను,గుణసంయుతులు=మంచిగుణములుకలవారు,ఎవ్వరున్= ఎవరైనను, మెచ్చరు=నుతియింపరు, ఎట్లనఁగా:—మంచికూరను,పదనుగన్= పక్వముగా, నలపాకమున్=నలుడుచేసిన పాకముఁబోలెడి పాకమును, చేసినన్=వండినప్పటికిని, అందున్=ఆకూరలో, ఇంపు + ఒదవెడు + ఉప్పు=రుచి, గలిగించెడు లవణము- లేక=లేకుండిన రుచి=చవిపుట్టగ నేర్చు నటయ్యా=కలుగునయ్యా! కలుగదని యర్థము.

తా. కూరనెంత బాగుగా వండినను, దానియందు లవణము గలియక పోయిన రుచియుండదు. దాని నెవ్వరు విశ్వసింపరు. అట్లే మనుజుఁడెంత విద్యావంతుఁడైనను, రసగ్రహణ శక్తి లేకున్న, వాని చదువంతయు నిరర్థకమగుట యేగాక, గుణగ్రహణ పారీణులెవ్వరును వానిని గణింపరు.

ఉ॥ చాలఁబవిత్రవంశమున • సంజనితుండగు నేని యెట్టి దు
శ్శీలునినైనఁ దత్కులవి • శేషము చేనొకపుణ్యుఁడెంతయుఁ
దాలిమినుద్ధరించును; సు • ధానిధిఁబుట్టఁగఁగాదె శంభుఁడా
హాలహాలానలంబుగళ•మందుధరించుటకుపూనిభాస్కరా. 43

టీ. భాస్కరా. చాలన్=మిగుల, పవిత్రవంశమునన్=పావనమైన కులమందు, సంజనితుండు=ఉదయించినవాఁడు, అగున్ + ఏని= అయిన యెడల, తత్ + కులవిశేషముచేతన్=వానికులగౌరవముచే, ఎట్టి దుశ్శీలుని నైనన్=ఎటువంటి దుర్మార్గునినైనను, ఒకపుణ్యుఁడు=ఒకపుణ్యవంతుఁడు, ఎంతయున్=మిగుల, తాలిమిన్=ఓర్పుచేత, ఉద్ధరించును=సంరక్షించును, ఎట్లనగా:—శంభుఁడు=మహేశ్వరుఁడు, పూని=ప్రయత్నమొనరించి, ఆహాలహాలానలంబు=ఆహాలాహలమనెడి యగ్నిజ్వాలను, గళమందున్=కంఠమందు, ధరించుట=తాల్చుట, సుధానిధిన్=పాలసముద్రమునందు, పుట్టఁగన్ + కాదె=జనించుటచేతనే గదా

తా. హాలాహలమనెడి భయంకరాగ్ని క్షీరసాగరమున జన్మించిన దను హేతువుచేత నీశ్వరుఁడు గళమందునఁ ధరించినటుల; ఎట్టిదుర్మార్గుఁడైనను సద్వంశమునఁ బుట్టుటచేఁ దత్కులగౌరవమువలన, బుణ్యాత్ముఁడెవ్వఁడేని వానిని గౌరవించి కాపాడును.

---

43. దేవదానవు లమృతముకొఱకు పాలకడలిని దరువఁగా హాలాహలమనెడి విషాగ్ని యందుఁబుట్టి, జగత్సంక్షోభముఁ జేయుచుండ, దేవతాప్రార్థనమువలన శంకరుఁడావిషాగ్నిని తన కంఠమందు నిడుకొనిలోకములకు శాంతిం గలిగించెను. తత్కారణమున గరళకంఠుఁడు, నీలగళుఁడు, శ్రీకంఠుఁడుం విషగళుండు నని యీశ్వరుడు పేర్కొనఁబడు చుండెను.

ఉ॥ చేరిబలాధికుండెఱిఁగి • చెప్పినకార్యము చేయకుండినన్
పారము ముట్టలేడొకనెపంబునఁదాఁజెడు నెట్టిధన్యుఁడున్
గోరకపాండుపుత్రులకు • భూస్థలిభాగము పెట్టుమన్న కం
సారినిగాకు చేసిచెడఁ • డాయెనె కౌరవభర్త భాస్కరా. 44

టీ. భాస్కరా! బల + అధికుఁడు=బలముఁగల గొప్పవాఁడు, చేరి=దగ్గరకువచ్చి, ఎఱిఁగి=(ముందురాబోవు విషయమును) గ్రహించి, చెప్పిన కార్యము=చెప్పినట్టిపని, చేయక × ఉండినన్=చేయకున్నయెడల, ఎట్టి ధన్యుఁడు=ఎటువంటి ధన్యాత్ముఁడును, పారము=కడను, ముట్టలేడు=పొంద జాలఁడు, ఒక నెపంబునన్=ఒక హేతువుచే, తాన్=తాను, చెడున్=పాడయి పోవును, ఎట్లనఁగా:— పాండుపుత్రులకున్ = పాండురాజకుమారులకు భూస్థలిన్=భూమిని, భాగము పెట్టుము=సగపాలొసఁగుము, అన్నకంసారిని= అనిన శ్రీకృష్ణభగవానుని, కాకుచేసి=తిరస్కరించి (నిందించి) కౌరవభర్త= దుర్యోధనమహారాజు, చెడఁడాయెనె=చెడిపోవలేదా? (చెడెననుట.)

తా. శ్రీకృష్ణమూర్తి సుయోధనునొద్దకరిగి పాండవులకర్ధరాజ్యంబు నొసఁగుమని యెంతయో బోధింపఁగా నతనిమాటలు నిరాకరించి దుర్యోధనుఁ డస్తమించెను. అట్లే ప్రకారముగ బలశాలి తనవద్దకేతెంచి చెప్పినకార్యము నిర్వహింపనివాఁడు శీఘ్రకాలమున నశించిపోవును.

ఉ॥ చేసినదుష్టచేష్ట నది • చెప్పక నేర్పునఁ గప్పిపుచ్చితా
మూసినయంతటన్ బయలుమట్టకయుండ దదెట్లు రాగిపై
బూసిన బంగరుం జెదరిపోవఁగడంగిననాఁడు నాటికిన్
దాసిన రాగి గానఁబడ • దాజనులెల్లనెఱుంగ భాస్కరా. 45

టీ. భాస్కరా! మనుష్యుఁడు, చేసినదుష్టచేష్టన్=తాఁజేసినచెడ్డ కార్యము, చెప్పక=పరులకెఱిగింపక, నేర్పునన్=తెలివిచేత, కప్పిపుడు=

చాటొనర్చి, తాన్=తాను, మూసినయంతటన్=అగపడకుండ జేసినను, బయలుముట్టక=బయలుపడక, ఉండను. అది + ఎట్లు=అదియెట్లనఁగా, రాగిపైన్=రాగిమీద, పూసినబంగరున్=పూతపెట్టినబంగారము, చెదిరిపోవన్=చెదరిపోవుటకు, కడంగినన్=ప్రారంభించఁగా, నాడునాటికిన్=క్రమక్రమమున, దాశినరాగి=అంటియున్న తామ్రము, జనులు + ఎల్లన్=జనులందఱు, ఎఱుంగన్=తెలియునట్లు, కానఁబడదా=కనబడ లేదా? (కానుపించుచున్నది.)

తా. రాగిపైఁ బూతవెట్టినబంగారము చెదరిపోయినతోడనే, యందున్న తామ్రము యెల్లవారలకుఁ గానుపించునటుల పాపాత్ముఁడు తాఁజేసిన దుష్కార్యములు గప్పిపుచ్చినను లోకమునకుఁ దెలియకమానదు.

చ॥ తగిలిమదంబుచే నెదిరిఁదన్ను నెఱుంగక దొడ్డవానితోఁ
బగఁగొని పోరుటెల్ల నతి • పామరుఁడై చెడుటింతె కాకతా
నెగడిజయింపనేరఁ డది • నిక్కముతప్పదు; ధాత్రిలోపలన్
దెగియొకకొండతోఁదగరు•ఢీకొనితాఁకిననేమిభాస్కరా. 46

టీ. భాస్కరా! తగిలి=వెంటఁబడి, మదంబుచేన్=మత్తతచేత, ఎదిరిన్=పగతురబలమును,ఎఱుంగక=తన్నును=తనబలమును తెలిసికొనలేక, దొడ్డవానితో, పగన్ + కొని=విరోధమువహించి,పోరుట + ఎల్లన్=కలహించుటంతయు, అతిపామరుఁడు + ఐ=శుద్ధమూర్ఖుఁడై చెడుట=పాడగుటయే, ఇంతెకాక=ఇంతకంటెవేఱుగా, తాన్=తాను, నెగడి=వృద్ధిజెంది, జయింపనేరఁడు=సాధింపఁజాలఁడు, నిక్కము=నిజము, తప్పదు=ఇదితప్పిపోదు, ధాత్రిలోపలన్=పుడమియందు, తగరు=గొఱ్ఱెపోతు, తెగి=సాహసముతో, ఒక్కకొండతోన్=ఒకఅద్రితో, ఢీకొని=ఎదిరించి, తాకినన్=తలపడినవో మి=ఏమిఫలము? (ఫలము లేదనుట.)

తా. గొఱ్ఱెపొట్టేలు సాహసించి యొకపర్వతముతో ఢీకొనినచోఁ దలపుఱ్ఱె బ్రద్దలగుటతప్ప ఫలమింతయు లేకపోవునట్లు, బలహీనుఁడు తన బలమును, యెదిరిబలమును యోజనసేయక, బల్లిదునితోఁ గలహించినఁ దాను నాశనమగుటయెగాని లాభము లేదు.

చ॥ తడవఁగరాదుదుష్టగుణుఁ • దత్త్వమెఱుంగక యెవ్వరైననా
చెడుగుణ మిట్లు వల్వదని • చెప్పిన గ్రక్కునఁగోపచిత్తుఁడై
కడుఁదెగఁజూచుఁగా,మఱుఁగఁ•గాగిన తైలము నీటిబొట్టుపైఁ
బడునెడనాక్షణంబెగసి•భగ్గునమండకయున్నె భాస్కరా, 47

టీ. భాస్కరా! దుష్టగుణుఁన్=దుర్గుణములుగలవాని, తత్త్వము=నిజము, ఎఱుంగక=తెలిసికొనలేక, తడవరాదు=వానిజోలికేగరాదు, ఎవ్వరు + ఐనన్=ఏమనుజులైన, ఆచెడుగుణము=వారలొనరించు చెడ్డపని, ఇట్లు=ఈ ప్రకారము, వల్వదు=వలదు, అనిచెప్పినన్=బోధించినయెడల, గ్రక్కునన్ త్వరితముగ, (శీఘ్రముగ) కోపచిత్తుఁడు + ఐ=కోపముతోఁగూడిన హృదయముగలవాఁడై, కడున్=మిక్కిలి, తెగన్=సాహసకార్యముఁ గావించుటను, చూచుగా=తలంచునుగదా, ఎట్లన:—మఱుఁగన్=సలసలఉడుకునట్లు కాగినతైలము=మఱిఁగినతైలము, నీటిబొట్టు=జలబిందువు, పైన్=తనమీద, పడునెడన్=పడెడివేళయందు, ఆక్షణంబు + ఏ=అతక్షణమే, ఎగసి=పైకి లేచి, భగ్గునన్=భగభగమని, మండక + ఉన్నె=మండకుండునా? (మండు ననుట.)

తా. ఎక్కువగా మఱిగిన నూనెమీదనీటిచుక్కపడినచో మీదికిలేచి భగ్గునమండునట్లు; దుష్టుఁడుహితోపదేశముఁ జేయువారిపై క్రోధాతిరేకమున మండిపడును. కావున, వాని తెరవెనకుఁ బోరాదు.

చ॥ తనకు ఫలంబులేదనియెం•దండలపోయఁడు కీర్తిఁగోరునా
ఘనగుణశాలి లోకహిత•కార్యము మిక్కిలిభారమైన మే

లనుకొనిపూను, శేషుఁడు • సహస్రముఖంబులగాలిఁగ్రోలితా
ననిశము మోవఁడేమఱిమ• హాభరమైనధరిత్రి భాస్కరా. 48

టీ. భాస్కరా! కీర్తిక్=యశస్సును, కోరు=ఆసించు (అపేక్షించు) ఆఘనగుణశాలి=ఆగొప్పగుణములచే నొప్పుచున్నవాఁడు, తనకుక్=తనకు, ఫలంబు=లాభము, కాదు + అని=కలిగియుండ లేదని, ఎదక్=మనస్సునందు, తలపోయఁడు=యోజనసేయఁడు, లోకహితకార్యము=జగంబునకు మేలయిన పని, మిక్కిలి=ఎక్కువ, భారము + ఐనక్=కష్టమైనను. మేలు=మంచిది, అనుకొని=ఆలోచనఁజేసి, పూనుస్=ఆకార్యమునకు ప్రయత్నించును, ఎట్ల నఁగా; శేషుఁడు=ఆదిశేషుఁడు, సహస్రముఖంబులక్=తనవేయి ముగముల చేతను, పవనమును=గాలిని, క్రోలి=భక్షించి, తాక్=తాను, మఱి, మహా భారము=మోయఁజాలనిబరువును, ఐనధరిత్రిక్=అయినభూమిని, అనిశముక్= ఎల్లప్పుడును, మోవఁడు + ఎ = మోయుచుండుటలేదా? (మోయుచున్నాఁడని యర్థము.)

తా. శేషుఁడు గాలిఁగ్రోలి లోకోపకారార్థము భూభారమును= మోయుచున్నట్లుఁ జగంబునఁగీర్తినిఁ గోరువాఁడు తనకు ఫలితములేకపోయి నను, జగనుపకారమగుపని యెంతభారమైనను నెరవేర్చునుఁగాని, తనలాభ ముకొఱకు చూడఁడు.

---

48. శేషుఁడు=కశ్యపప్రజాపతి జ్యేష్ఠపుత్రుఁడు. నాగులలో నగ్ర గణ్యుఁడు. ఇతఁడు. తనతల్లియైన కద్రువయును, సోదరులునుచేసిన యక్రమము నితఁడంగీకరింపక, వారి నెడబాసి దివ్యక్షేత్రములయందు ఘోర తపంబొనర్పఁగా, నలువ యాతని తపస్సునకు మెచ్చి, భూభారమునువహించు శక్తినొసఁగెను. మఱియు, నితండు మహేశ్వరానుగ్రహముచే నారా యణునకుఁ బానుపై, భూభారము మోయుచుండెను. తొల్లి భృగుమహర్షి యిచ్చిన శాపమువలన నితఁడు బలరామావతారమెత్తెను.

చ॥ తనకు నదృష్టరేఖ విశ । దంబుగఁగల్గినఁగాని లేనిచో
జనునకున య్యెడన్ బరుల । సంపదవల్ల ఫలంబు లేదుగా
కనుఁగవ లెస్సఁగాఁ దెలివిఁ । గల్గినవారికిఁగాక గ్రుడ్డికిన్
కనుపడునెట్లువెన్నెలలు।గాయఁగనందొకరూపుభాస్కరా. 49

టీ. భాస్కరా! తనకున్=తనకు, అదృష్టరేఖ=భాగ్యరేఖ, విశదంబుగన్=స్పష్టముగ, కల్గినన్ + కాని=ఉండినఁగాని, లేనిచోన్=భాగ్యచిహ్నము లేనప్పుడు, జనునకున్=మనుష్యునకు, ఏ + ఎడన్=ఏవేళయందును. పరుల సంపదవల్లన్=పరులైశ్వర్యమువలన, ఫలంబు=లాభము, లేదుగా=లేదు కదా, ఎట్లనన్; కనుగవన్=నేత్రములయందు, తెలివి=ప్రకాశమానము, లెస్సగాన్=బాగుగా, కల్గినవారికిఁగాక=కలిగియున్న మనుష్యులకుఁదప్ప, గ్రుడ్డికిన్=అంధునకు, వెన్నెలలు=చంద్రికలు, కాయఁగాన్=విజృంభింపఁగాన్ (వ్యాపింపఁగా) అందున్=ఆవెన్నెలలందు, ఒకరూపు=ఒకరూపమైనను; ఎట్లుకనపడున్=ఏవిధమునయగడును. (కనుపడదనియర్థము).

తా. వెన్నెల దిశలంతట నలుముకొనియున్నను, దానిలో స్వరూపములు దృష్టిప్రసారము బాగుగానున్నవారికిఁగాని యంధునకు గోచరముగానటుల ,పరుల భాగ్యము లంతట బ్రసిద్ధమైయున్నను, వానివలన ఫలితార్థముకలవారికేఁగాని, దురదృష్టవంతులకుఁ గలుగదు.

ఉ॥ తాలిమితోడు తందగవు । తప్పక నేర్పరియొప్పుఁదప్పులం
బాలన సేయుగాకటను । పాయవిహీనుఁడు సేయనేర్చునే?
పాలునునీరు వేఱుపఱు । పంగ మరాళమెఱుంగుఁగాకమా
ర్జాలమెఱుంగునె తదుప । చాతురసజ్ఞతబూనభాస్కరా 50

టీ. భాస్కరా! నేర్పరి=వివేకముఁగలవాఁడు, తాలిమితోడుతన్=ఓర్పుతో, (తగవు=సత్యమును, తప్పక=పాయక, ఒప్పుతప్పులన్=ధర్మ=

ధర్మములను, పాలనసేయుఁగాక=పాలించునుగాని, అటన్=ఆకార్యమును ఉపాయవిహీనుఁడు=తెలివిలేనివాఁడు, చేయన్=చేసిన, నేర్చును + ఎ= సమర్థుఁడగునా! (కాదనుట) మరాళము=హంస, పాలును=క్షీరమును, నీరును=జలమును, వేఱుపఱుపంగన్=వేర్వేరుఁజేయుటను, (విభజించుటను) ఎఱుంగున్ + కాని=తెలిసికొనును గాని, మార్జాలము=పిల్లి, తత్=ఆరాజహంసయొక్క, ఉరు=ఘనమైనదియు, చారు=మనోజ్ఞమయినదియు, నగురసజ్ఞతన్=రసగ్రహణశక్తిని, ఊనన్=వహించుట, ఏఱుంగును + ఏ=తెలిసికొనఁగలదా? ఎఱుఁగలేదనుట.)

తా. క్షీర, నీరముల వేఱుపఱుప రాయంచకేతగునుగాని, పిల్లికిఁదగనట్టులె; న్యాయా, న్యాయవిమర్శనము నిపుణతఁగలవాఁడు శక్తుఁడుగాని తెలివిహీనుఁడు సమర్థుఁడుకాఁడు.

ఉ॥ తాలిమితోడఁగూరిమిఁగృతజ్ఞునకెయ్యెడ నుత్తమోత్తముల్
మేలొనరించినన్ గుణము। మిక్కిలికీడగుఁ, బాముపిల్లకున్
బాలిడిపెంచినన్ విషము। పాయఁగ నేర్చునె దానికోఱలం
జాలగనంతకంతకొక। చాయను హెచ్చునుగాక భాస్కరా! 51

టీ. భాస్కరా. ఉత్తమ + ఉత్తముల్=మిక్కిలిమంచివారు, తాలిమితోడన్=శాంతముతో, కూరిమిన్=దయచేత, కృతఘ్నునకున్=చేసినయుపకారమును మఱచువానికి, ఎయ్యెడన్=ఏవేళయందును, మేలు=ఉపకారము, ఒనరించినన్=చేసియున్నచో, గుణము=తానొనర్చిన మేలువలన గలిగెడుఫలము, మిక్కిలికీడు + అగున్=చెడుగలిగించును, (ఎట్లనఁగా) పాముపిల్లకున్=త్రాచుపిల్లకు, పాలు + ఇడి=పాలుఁబోసి, పెంచినన్=పోషించినచో, దానికోఱలన్=ఆపాముపిల్లకోఱయందు, విషము=గరళము, చాలఁగన్=మిక్కిలిగాఁ అంతకంతకున్=క్రమక్రమముగా, ఒకచాయన్

ఒక విధముగా, హెచ్చునుగాక=వృద్ధియగునుగాని పాయఁగ + నేర్చునే + ఏ=అగరళమును విడిచిపెట్టునా? (విడువదని యర్థము.)

తా. పాముపిల్లకుఁ బాలుపోసి పెంచినను, దానిదంతములయందు విషము క్రమక్రమముగా వృద్ధిఁజెందునుఁగాని తగ్గనటుల; చేసిన మేలు మఱచెడివానికి మేలుఁగలిగించినను నందువలన ఫలము మిక్కిలి విపరీతమగును.

చ॥ తెలియనికార్యమెల్లఁగడ । తేర్చుటకొక్క వివేకిఁజేకొనన్
వలయునటైనదిద్దుకొన। వచ్చుబ్రయోజనమాంద్యమేమియుం
గలుఁగదు, ఫాలమందుఁ దిల। కంబిడుసప్పుడు చేతనద్దమున్
గలిగినఁజక్కఁజేసుకొనుఁ। గాదెనరుండదిచూచిభాస్కరా: 52

టీ. భాస్కరా! తెలియనికార్యము + ఎల్లన్ = తెలియని పనియంతయును, కడతేర్చుటకున్=నిర్వహించుటకు, ఒక్కవివేకిన్=ఒకజ్ఞానముఁగలమానవుని, చేకొనన్ + వలయు=చేరదీసికొనవలయును, అటు + ఐనన్=అటులయినయెడల, దిద్దుకొనినన్ వచ్చున్ = లోపములను తొలిగించుకొని పనిని సానుకూలముఁ జేయవచ్చును. ప్రయోజన మాంధము=పనియందు వాలస్యము, ఏమియున్=ఇంచుకంతయును, కలుఁగదు=సంభవింపదు, (ఎట్లనఁగా) నరుండు=మనుష్యుఁడు, ఫాలమందున్=నుదుటను, తిలకంబును=బొట్టును, ఇడునప్పుడు=పెట్టుకొనెడి తఱి, చేతన్=కరమందున, అద్దమున్=దర్పణమును, కలిగినన్=ఉండినచో, అది=ఆయప్పమును, చూచి=వీక్షించి, చక్కజేసికొనున్ + కాదు + ఎ=చక్కఁగా దిద్దుకొనునుఁగదా!

తా॥ మానవుఁడు మొగమునఁ దిలకము దిద్దుకొనునప్పుడు కరంబున నద్దమున్నచో, దానినిఁ జూచుకొని బొట్టునుఁ జక్కఁగా సవరించుకొనునట్లు; తన కసాధ్యమగు కార్యమును సాధింపఁదలఁచిన, వివేకిని దరిఁజేర్చుకొనినచో, వాని మూలమునఁ దత్కార్యము నిర్వహించుకొనును.

ఉ॥ దక్షుఁడులేని యింటికిఁ బ • దార్థము వేతొకచోటనుండి వే
లక్షలు వచ్చుచుండినఁ బలాయనమై చనుఁగల్లకాదు, ప్ర
త్యక్షము వాఁగులుఁ వఱదలన్నియు వచ్చిన నీరునిల్చునే
యక్షయమైనగండి తెగినట్టి తటాకములోన భాస్కరా. 53

టీ. భాస్కరా! దక్షుఁడు=సంసార భారమును వహించినట్టియజమానుఁడు, లేని యింటికిన్=లేనట్టి గృహమునకు, పదార్థము=ధనము, వేఱు + ఒకచోటనుండి=మఱియొక ప్రదేశమునుండి, వేలక్షలు=వేయిలక్షల రూప్యములు, వచ్చుచుండినన్=వచ్చుచున్నప్పటికి, పలాయనము + ఐ=పలాపంచలై (చెదా చెదరై) పోవును=అంతరించును, కల్లగాదు=అనృతముగాదు, ప్రత్యక్షము=స్పష్టము, (ఎట్లనన్) వాగులు=కొండలలో బయలుదేరిన కాలువలు, వరదలు + అన్నియున్=జలప్రవాహములన్నియు, వచ్చినన్=వచ్చుచుండినను, అక్షయము=గొప్పది, ఐనగండి=అయినట్టి కన్నము, తెగినట్టి తటాకములోన్=పడిన చెఱువులోపల, నీరు=జలము, నిల్చునే=నిలువఁబడునా? (ఉండదని యర్థము.)

తా. గండి తెగిన తటాకములోని కెన్ని నదీప్రవాహములు వచ్చుచున్నను, నీరు గొంచెమైన నా చెఱువున నిలువకపోయినట్లు; కుటుంబభారమునుఁ బూనిన గృహాధిపతి లేనియెడల, నెన్ని మార్గములుగా నింటికి ధనంబు వచ్చుచున్నను. తక్షణమే చెల్లిపోవుచుండునుఁగాని కొంచెమైన నిలువదు.

ఉ॥ దాన పరోపకార గుణ • ధన్యత చిత్తములోన నెవ్వఁడున్
లేనివివేక శూన్యునకు • లేములు వచ్చినవేళ, సంపదల్
పూనినవేళ, నొక్కసరి • పోలును జీకున కర్థరాత్రియుం
లేనన దేమి పట్టపగ • లైన న దేమియులేదు భాస్కరా. 54

టీ. భాస్కరా! దాన=ఈవి, పరోపకార=పరులకు మేలుచేయుట, గుణ=సుగుణములచేత, ధన్యత=కృతార్థత్వము ఎప్పుడుఀ=ఏకాలమందును, చిత్తములో=ఎదలో (హృదయములో) లేని వివేకశూన్యునకుఀ=లేవట్టి మూఢునకు, లేములు=లేదతనములు, (దారిద్ర్యములు) వచ్చినవేళఀ=సంప్రాపించిన వేళయందు, సంపదల్=భాగ్యములు, పూనినవేళఀ=వహించిన శక్తి, ఒక్క సరిపోలును= ఒకరీతిగనే యుండును. (ఎట్లన) చీకునకుఀ=అంధునకు, అర్ధరాత్రి=అర్ధమరేయి, ఐనఀ + అది + ఏమి=అయినప్పుడు దాని వలనఫలమేమి, పట్టపగలు=మధ్యాహ్నకాలము, అయినఀ అదియేమి= అయిన దానివలన లాభమేమి. అంధునకు నడురేయి, మధ్యాహ్నము నొకటియేయని భావము.

తా. గ్రుడ్డివానికి రే, బవలును రెండొకే విధముగ నుండునుగాని, భేదము నూహింపనట్లు; దాన, ధర్మము లెఱుంగని మూర్ఖునకు దారిద్ర్యము వచ్చినను, సంపద గలిగినను నొకతీరుగానే పరిణమించును.

ఉ॥ దానము సేయఁగోరిన వ • దాన్యునకీయఁగ శక్తిలేనిచో
నైనఁ బరోపకారమున•కై యొక దిక్కునఁ దెచ్చియైన నీఁ
బూనును మేఘుడంబుధికి•బోయిజలంబులఁ దెచ్చియీయఁడే
వాన సమస్తజీవులకు • వాంఛిత మింపెసలార భాస్కరా. 55

టీ. భాస్కరా! దానము=దాతృత్వము (ధర్మగుణము) చేయఀ= చేయుటకు, కోరిన వదాన్యునకుఀ=ప్రేమయున్న దాతకు, ఈయఀ + కఀ= ఒసఁగుటకు, శక్తి=సామర్థ్యము, లేనిచోఀ + ఐనఀ=లేకపోయినను, పరోపకారమునకుఀ=అన్యుల కుపకారము చేయుటకు, ఒక దిక్కునఀ=వేఱొకచోటున, తెచ్చి + ఐనఀ=గొనివచ్చియైన, ఈన్=ఇచ్చుటకు, పూనును= ప్రయత్నించును, (ఎట్టులనఁగా) మేఘుఁడు=మబ్బు, అంబుధికిఀ=కడలిదరికి, పోయి=వెళ్ళి, జలంబులఀ=నీటిని, తెచ్చి=కొనివచ్చి, సమస్తజీవు

లనగ=ఎల్ల ప్రాణులకు, వాంఛితము=కోరిక, ఇంపెసలు + అరన్=ఫలిం చునట్లుగా, వానన్=వర్షమును, ఈయఁడు + ఎ=ఒసఁగఁడా ? (మరియు చున్నాడనుట.)

తా. మేఘము తనయొద్ద జలము లేనప్పుడు కడలియొద్దకుఁ బోయి, యుదకమును సంగ్రహించి, సకలజీవులు నానందముఁ నుగాంచునట్లు వర్షించును. అట్లె, దానపరుఁడు తనయొద్ద ధనము లేనప్పు డొకరియొద్ద ఋణముఁ జేసియైన నిచ్చుచుండును.

ఉ॥ దానముచేయ నేరని యధార్మికుసంపద యుండియుండియున్
దానెపలాయనంబగుట తథ్యము, బూరుగు మ్రానుఁగాంచినన్
దానిఫలంబులూరక వృథా పడిపోవవె యెండి గాలిచేఁ
గానలలోన నేమిటికిఁ గాకయభోజ్యములౌటభాస్కరా. 56

టీ. భాస్కరా! దానము=ధర్మము, చేయ నేరని అధార్మికు సంపద=ధర్మముఁ జేయ నిష్టపడని లోభివానియైశ్వర్యము, ఉండియుండినన్=కలిగి యుండినను, తాను + ఎ=తనునుఁదానె, పలాయనంబు + అగుట=పారిపోవుట, తథ్యము=నిజము, (ఎట్లనఁగా) బూరుగుమ్రాను=శాల్మలివృక్షము (బూరుగుచెట్టు) కాచినన్=పండినను (ఫలించినను) దానిఫలంబు=ఆబూరుగు చెట్టుయొక్క పండ్లు, అభోజ్యములు=తినరానివి (భుజింపదగనివి) అగుటన్=అయియుండుటచే, ఊరక=మిన్నక, వృథా=వ్యర్థముగా, ఎండి=ఎండిపోయి, గాలిచేన్=గాడ్పువలన, కానలలోన్=అరణ్యములలో, ఏమిటికిఁగాక=ఎందునకుఁగొరగానక, పడిపోవవు + ఎ=పడిపోవుచుండ లేదా?

తా. బూరుగువృక్షము ఫలించినను, దానిపండ్లెవ్వరుఁ దినుటకేనిఁ బనికిరాక, గాలితాకుడుచే నరణ్యముల రాలిపడి వ్యర్థమగురీతి, త్యాగము లేనివానికి సంపదలున్నను నవియున్నట్టు లేయుండి, పరుల కుపయోగింపక పోవు చుండును.

చ॥ నడువక చిక్కి లేమియగు • నాఁడు నిజోదరపోషణార్థమై
యడిగి భుజించుటల్ నరుల • కారయ వ్యంగ్యము కాదు పాండవుల్
కడుబలశాలు లేవురు న • ఖండవిభూతిఁ దొలంగి భైక్షముల్
గుడువరె యేకచక్రపురిఁ • గుంతియుఁ దారొకచోట భాస్కరా.

టీ. భాస్కరా! నడవక = జరుగుబాటు లేక, లేమియగునాఁడు = దారిద్ర్యము సంభవించు నప్పుడు, నిజ + ఉదరపోషణ + అర్థమై = తనపొట్టనింపుకొనుటకు, అడిగి = యాచించి, భుజించుటల్ = తినుటలు, అరయన్ = విచారింప, నరులకున్ = మానవులకు, వ్యంగ్యము = నిందారోపణము కాదు. (ఎట్లనగా) కడున్ = మిక్కిలి, బలశాలులు = పరాక్రమోపేతులు, ఏవురు = అయిదుగురు, పాండవుల్ = పాండుపుత్రులు, అఖండవిభూతిన్ = అధికైశ్వర్యమునుండి, తొలంగి = ఎడబాసి, ఏకచక్రపురిన్ = ఏకచక్రమను పురంబున, తారును, తాము, (పాండవులును) కుంతియున్ = (తల్లియైన) కుంతీదేవియు, ఒకచోటన్ = ఒక్కప్రదేశమందు, భైక్షముల్ = యాచించి తెచ్చినయన్నములు, కుడువరు + ఎ = భుజింపరా? (భుజించిరనుట.)

తా. పాండుకుమారులు బలోద్దీపితులయ్యు సకలైశ్వర్యాదులఁ గోలుపోయి, తల్లియగు కుంతితో నేకచక్రపురంబున భిక్షాటనమొనర్చి జీవించినట్లు; జగంబున మనుజుఁడు దారిద్ర్యమనుభవించునప్పుడు, పొట్టనింపుకొనుటకై పరులయాచించినను లోపంబుకాదు.

చ॥ నుడువుల నేర్పుచాలని మ • నుష్యుఁడెఱుంగక తప్పునాడినం
గడుఁగృపతోఁ జెలంగుదురు • కానియదల్పరు తజ్జ్ఞులెల్లఁ ద
ప్పడుగులు వెట్టుచున్నఁ డచు • నప్పుడు బాలుని ముద్దుసేయఁగా.
దొడఁగుదు రెంతె గానిపడఁ • ద్రోయుదురే యెవరైన భాస్కరా.

టీ. భాస్కరా! నుడువులన్=మాటలందు, నేర్పు=చాతుర్యము, చాలనిమనుష్యుఁడు=లేనట్టిమానవుఁడు, ఎఱుంగక=తెలియక, తప్పు + ఆడినన్=అన్నృతముఁ బలికినచో, తత్‌జ్ఞులు + ఎల్లన్=శాస్త్రవేత్తలందఱు, కడున్=మిగుల(మిక్కిలి)కృపతోన్=దయతో(ప్రేమతో)చెలంగుదురు=ఒప్పుకొందురు, కాని, అదల్పరు=కోపముతో గద్దరించరు, ఎట్లనఁగా) తప్పు + అడుగుల్=తప్పటడుగులు, పెట్టుచున్=వేయుచు, నడుచునప్పుడు=నడచెడికాలమందు, బాలునిన్=బాలకుని, ముద్దుచేయన్ + కాన్= ప్రేమించుటకు, తొడఁగుదురు=ప్రారంభించెదరు, ఇంతేకాని=అదియేగాక, ఎవరే + నినన్ = ఎట్టిదుష్కర్ముఁడైనను, పడన్ = క్రిందఁబడునట్లుగా, త్రోయుదురు + ఎ = గెంటుదురా?(త్రోయరనుట.)

తా. ఎంతటికఠినకర్ములైనను తప్పటడుగులతో నడచెడిబాలుని ప్రేమింతురుగాని, క్రిందికిఁబడఁద్రోయరు, అట్లె పండితోత్తములు, మాటలయందు చాతుర్యమెఱుంగనివారు తప్పుబలికినను, విని సంతసిల్లెదరుగాని యదలించరు.

ఉ॥ నేరిచి బుద్ధిమంతుఁ డతి • నీతివివేకము దెల్పినం జెడం
గారణమున్నవానికది • కైకొనఁగూడదు నిక్కమే దురా
చారుఁడు రావణాసురుఁడ • సహ్యముఁనొందఁడె చేటుకాలముం
జేరువయైననాఁడునిర • సించి విభీషణుబుద్ధి భాస్కరా. 59

టీ. భాస్కరా! బుద్ధిమంతుఁడు = జ్ఞానముఁగలవాఁడు, నేరిచి= అభ్యసించి, అతినీతివివేకము=నీతియొక్క విశేషాధిక్యమును, తెల్పినన్=తెలియఁజేయఁగా చెడన్=పాడయిపోవుటకు, కారణమున్నవానికిన్= హేతువున్నవానికి, అది=అనీతి, కైకొనన్=గ్రహించుటకు, కూడదు=చెల్లదు, నిక్కము + ఎ=సత్యమే, దురాచారుఁడు=దుష్ప్రవర్తనఁగలవాఁడు, (రావ

ణుఁడు) ఛేటుకాలము=నాశనకాలము, చేరవ + ఐనవాఁడు= సమీపించిన పుడు, విభీషణుబుద్ధి=విభీషణుఁడు చెప్పిననీతిమార్గము, నిరసించి=త్రోసి వేసి, (నిందించి) అసహ్యముపొందఁడు + ఎ=కోతనుఁజెందఁడా (కోసెను)

తా. క్రూరాత్ముఁడగు రావణాసురుఁడు తనకు పోగాలము వచ్చుట చేత, తమ్ముఁడగు విభీషణుని సుబోధఁ దిరస్కరించినట్లుల; లోకమున మానవుఁడు తనకుఁ జేటుకాలమాసన్నమైనప్పుడు, ధీమంతుల హితవచనముల నాలింపఁడు.

చ॥ నొగిలినవేగి నెంతటిఘనుండును దన్నొక రొక్కనేర్పుతో
నగపడిప్రోదిసేయక త • నంతట బల్మికిరాఁడు నిక్కమే
జగమున నగ్నియైనఁగడుసన్నగిలంబడియున్న నింధనం
బెగయగద్రోచియూదకమఱెట్లురవుల్కొననేర్చుభాస్కరా.

టీ భాస్కరా! నొగిలినవేళ=పేదరికము, (గలిగియున్నప్పుడు, ఎంతటిఘనుండున్=ఎంతగొప్పవాఁడైనను, తన్నున్=తన్ను, ఒకరు=మఱియొకరు, ఒక్కనేర్పుతో=ఒకయుక్తితో, (ఒక యుపాయముతో) అగపడి=కానుపించి, ప్రోదిచేయక=రక్షణ సేయకుండ, తనంతట=తనకుఁదాను, బల్మికిన్ రాడు=బలమును పొందలేడు, నిక్కము + ఏ=నిశ్చయమె (నిజమె) ఎట్లనఁగా: జగమునన్=లోకమునందు, అగ్నియైనన్=వీతిహోత్రుఁడైనను, కడున్=మిక్కిలి, సన్నగిలంబడియున్న=క్షీణించియున్న సమయమందు, ఇంధనంబున్=పొయిలోనికట్టెను, ఎగయన్ + త్రోచి=పోయిలోనికెగ ద్రోచి, ఊదక=ఊదకుండ, మఱిఎట్లు=ఇఁకనేలాగున, రవుల్కొనన్ నేర్చున్=ఎట్లు మండనేర్చును.

తా అనలుఁడు ప్రకాశమానుఁడైనను సన్నగిలినప్పుడు పొయిలో నికట్టెలను బాగుగా నెగఁద్రోసి యుపాయముతో నూదినఁగాని మరలమండ

నట్లు: ధనికునకుఁ బేదరికముఁగలిగి నప్పుడు, మఱియొకఁడు వానిని జేరదీసి సాకినఁగాని బలమును, వణింప లేదు.

ఉ॥ పండితులైనవారుదిగు • వందగనుండఁగ నల్పుడొక్కఁ డు
ద్దండతఁబీఠమెక్కిన బు• ధప్రకరంబుల కేమియెగ్గగున్
గొండొకకోతిచెట్టుకొన • కొమ్మలనుండఁగ క్రిందగండభే
రుండమదేభసింహనికు • రంబములుండవె? చేరిభాస్కరా

టీ భాస్కరా! పండితులు=విద్వాంసులు, ఐనవారు.=అయినట్టి మానవులు, దిగువన్=క్రింద, ఉండగన్=వసించియుండఁగా, అల్పుడు=కొద్దివాఁడు, (నీచుడు) ఒక్కఁడు, ఉద్దండతన్=దుష్టస్వభావముచే, పీఠము + ఎక్కినన్=సింహాసనమునఁగూర్చుండినచో, బుధ ప్రకరంబులకున్=పండితోత్తములకు, ఏమి ఎగ్గుఅగున్=ఏమి హాని సంభవించును, (కీడుఁగలుగదనుట) ఏట్లనన్; కొండొక కోతి=ఒకానొక మర్కటము, చెట్టుకొమ్మలన్=వృక్షశాఖలయందు, ఉండఁగన్=వసించియుండఁగా, క్రిందన్=నేలమీద, (చెట్టు దిగువభాగమున) గండ భేరుండ=గండభేరుండ మను పక్షుల యొక్కయు, మద + ఇభ=మదగజముల యొక్కయు, నికురంబములు=సమూహములు (గుంపులు), చేరి=కూడి, ఉండవు + ఎ=ఉండవా? ఉండునని యర్థము.

తా. చెట్టు క్రిందిభాగమున గండభేరుండ మృగములాది నివసించియుండఁగా, నా తరుశాఖలయందు కోతియొకటుండి నప్పటికి నాజంతువుల కీసువంతయులోపము లేదు. అట్లేపండితులు నేలమీద గూర్చుండినతరుణమున, నల్పుడొకఁడు చితాసనమునఁ గూర్చుండినంత మాత్రమున నావిద్వాంసుల కెంతమాత్రమునుఁ గొఱత లేదు.

ఉ॥ పట్టుగనిక్కుచున్ మదము • బట్టిమహాత్ములఁ దూలనాడి బట్టినకార్యముల్ చెడును • ప్రాణముపోవు నిరర్థదోషముల్ పుట్టు,మహేశుఁగాదని కు• బుద్ధినొనర్చిన యజ్ఞతంత్రముల్ ముట్టకపోయిదక్షునికి • మోసమువచ్చెఁగదయ్య భాస్కరా

టీ భాస్కరా! మదముఁబట్టి= గరువముచేత, పట్టుగన్=పట్టుదలగా నిక్కుచున్=నిల్గుచు, (గర్వించుచు) మహాత్ములన్=ఘనసీయులను, తూల నాడినన్=తృణీకరించునటులఁ, బలికిన. పట్టినకార్యముల్=తాను, ఆరంభిం చినబనులు, చెడును=నాశనమగును. ప్రాణముల్=జీవములు, పోవును, నిరర్థ దోషముల్=నిమిత్తము లేని పాపములు, పుట్టున్=కలుగును, ఎట్లనగా; మ మహేశున్=శంభుని, కాదని=ధిక్కరించి, కుబుద్ధిన్=దుర్బుద్ధిచేత (కుత్సిత బుద్ధిచేత) ఒనర్చిన యజ్ఞతంత్రముల్=చేసినట్టియా కార్యములు, ముట్టక= కొనసాగక, పోయి=నశించి, దక్షునికిన్=దక్షప్రజాపతికి, మోసము=హాని, వచ్చెన్‌కద + అయ్య=ప్రాప్తించెనుగదా.

తా మహేశ్వరునిపై ద్వేషించి యాతనినిఁబిలువక దక్షుఁడు, యజ్ఞమాచరించెనుగాని, సంపూర్తి కాకపోవుటయేగాక, దక్షప్రజాపతి జీవం బులఁ గోలుపోయినటుల, దుష్టాత్ముఁడు మదముచేఁ గ్రిందు మీదునుఁ గానక గర్వోద్రేకముచేఁ బూజ్యుల నపహసించి తానొక కార్యమును నిర్వర్తింపఁ దలఁచినయెడల, నాపని పాడగుటయేఁగాక ప్రాణాంతకముఁగూడకలుగును

62 తొల్లి దక్షుఁడు, బ్రహ్మసభలోఁ దన్ను శివుడు గౌరవింపలే దని కోపోద్దీపితుఁడై, తానొనరించు యజ్ఞమున నుపక్రకరమును బిలిచి, యీ శ్వరునిఁ బిలువక హవిర్భాగమొసంగకున్న రుద్రుండా యవమానమును, సహింపలేక వీరభద్రుని సృజించి,యజ్ఞమును నాశనముగావించి,దక్షునిప్రా ణంబులఁ బోగొట్టెను:

చ॥ పరహితమైనకార్యమతి • భారముతోడిదియైనఁ బూనుస
త్పురుషుఁడు లోకముల్ పొగడఁ • బూర్వమునందొక రాలవర్ష
మున్ ॥ గురియఁగఁ జొచ్చినన్ గదిసి • గొబ్బున గోజనరక్షణార్థమై
గిరినొక కేలనెత్తె। నట • కృష్ణుఁడు। ఛత్రముభాతి భాస్కరా.

టీ॥ భాస్కరా! పరహితము=ఒరులకు మేలుచేయునట్టిది. ఐనకార్యము=అయినట్టిపని. అతిభారము తోడిది + ఐనన్=మిగుల బరువుతో నొప్పినదైనను. లోకముల్=జగమందలి, మనుజులు=మనుష్యులు, పొగడఁగన్=స్తుతించునట్లుగా, పూనున్=ఆకార్యముఁ జేయ యత్నించును, (ఎట్లనగా) పూర్వమునందున్=ద్వాపరయుగమున, ఒక రాలవర్షమున్=ఒక రాళ్ళవానను కురియఁగఁ జొచ్చినన్=వర్షించుచుండగా, (కురియుచుండగా) కృష్ణుఁడు=వసుదేవనందనుఁడు, గొబ్బునన్=త్వరితముగ, కదిసి=దగ్గఱగాబోయి, గో=గోవులను. జన=జనులను, కాపాడునిమిత్తము, గిరిన్=మందరపర్వతమును, ఛత్రముభాతిన్=గొడుగురీతి, ఒక కేలన్=ఒక చెతితో, ఎత్తెనట=పైకెత్తి పట్టుకొనెననుట.

ఉ॥ పలుచని హీనమానవుఁడు • పాటిదలంపక నిష్ఠురోక్తులం
బలుకుచు నుండుఁగాని మతి•భాసురుఁడైన గుణప్రపూర్ణుఁ డ
ప్పలుకులఁ బల్కఁబోవఁడు ని•బద్ధిగ; నెట్లనవెల్తికుండఁ దాఁ
దొలఁకుచునుండుఁగాని మఱి•తొల్కునె నిండుఘటంబు భాస్కరా.

---

68. తొల్లి గొల్లలందఱు నింద్రయాగంబునుఁ గావింపుచుండ కృష్ణమూర్తి వారించినందున మహేంద్రుఁడు కోపించి, శిలావర్షమును కురిపించి గోకులంబును బాధింపఁగా, నందనందనుఁడు గోవర్ధనపర్వతమునుఁ బైకెత్తి గోవులను రక్షించెను. అంత నింద్రుండు భయాకులిత చిత్తుఁడై వాసుదేవుని దయకుఁ బాత్రుండయ్యెను.

టీ. భాస్కరా! పలుచని హీనమానవుఁడు=మిక్కిలి జాలుకనిమనుష్యుఁడు, పాటి=ధర్మమును, తలంపక= యోచన సేయక, నిష్ఠుర + ఉక్తులన్= పరుషవాక్యములను,పలుకుచుండుఁగాని=చెప్పుచుండునుఁగాని,మతిభాసురుడు =సద్బుద్ధిచేఁ బ్రకాశించువాఁడు ఘనగుణప్రపూర్ణుఁడు=సుగుణముచే నొప్పువాఁడు, ఆ + పలుకులన్=ఆమాటలను, నిబద్ధిగన్=నిజముగా, పలుకన్ + పోవఁడు=సంభాషణచేయఁబోడు, ఎట్లు + అనన్=ఏలాగువనగా. వెల్తికుండు=జలము తక్కువైన కడవ. తాన్=తాను, (ఘటముయనుట) తొలఁకుచునుండుఁగాని=తొణకుచుండినగాని, నిండుఘటంబు=నీటిచే నిండియున్న కుండ తొల్కును + ఎ=తొణకునా (కదలునా) తొణకదనుట.

తా. జలము వెలితిగానున్న కుండలోనినీరు తొణుకునటుల నీచమానవుం డెప్పుడును వదరుచుండును. నిండుకుండ తొణకని విధముగా గుణవంతుఁ డధికము సంభాషింపఁడు.

చ॥ పలుమరుసజ్జనుండుప్రియ•భాషలెపల్కుఁ గఠోరవాక్యముల్
పలుకఁ డొకానొకప్పుడవి•పల్కిన గీడునుగాదు; నిక్కమే
చలువకువచ్చి మేఘుఁడొక• జాడను దావడగండ్లురాల్చినన్
శిలలగునోటు వేగిరమె • శీతలనీరముఁగాక భాస్కరా. 65

టీ. భాస్కరా! సజ్జనుండు=సత్పురుషుఁడు, (మంచివాఁడు పలుమరు=అనేకమారులు, ప్రియభాషలు + ఎ=మంచివాక్యములె, పల్కున్= నుడువుచుండును, కఠోరవాక్యముల్=పరుషవచనములు, (చెడ్డమాటలు, పలుకఁడు = భాషింపఁడు, ఒకానొకప్పుడు = ఒకానొకసమయమునందు, అవి=అపరుషోక్తులు, పల్కినన్=వచియించి నప్పటికి, కీడునుకాదు =చెఱుపుగాదు, నిక్కము + ఏ=సత్యమే, ఎట్లనఁగా; చలువకున్=చల్లదనముఁ గలిగించుటకు, వచ్చి=ఏతెంచి; మేఘుఁడు=మబ్బు=తాన్=తాను,

వడగండ్లన్=కరకలను, రాల్చినన్=వర్షింపించినను, వేగిరము + ఎ=త్వరితము గనే, శీతలనీరముగాక=చల్లని యుదకముగానుండు శిలలగునో టు=ఱాళ్ళగునా (కావని యర్థము)

తా. మేఘుఁడు నీటిబిందువుల వర్షించుచు నొకానొకప్పుడు వడగండ్లను గురిసినను అవి రాలవలె కఠినముగాక కరఁగి జలమగునట్లు సజ్జనుఁడెల్లవేళను నవినయముగానే బలుకుచు, నొకప్పుడు పరుషవాక్యములాడినలుఁ జెడుగు సేయక మంచిగనే బరిణమించును.

ఉ॥ పాపపుఁదోవవాని కొక । పట్టున మేను వికాసమొందినన్
లోపలదుర్గుణంబె ప్రబ । లుంగద! నమ్మఁగఁగూడ దాతనిన్
బాపటకాయకున్ నునుపు । పైపయిగల్గినఁ గల్గుఁగాక నే
రూపునదానిలోఁగలవి ।రుద్ధపుఁజేదు నశించుభాస్కరా. 66

టీ. భాస్కరా! పాపపు త్రోవవానికిన్=దుర్మార్గునకు, ఒకపట్టునన్=ఒకసమయమందు, మేను=దేహము, వికాసము=ప్రకాశమానము, ఒందినన్=పొందినను, లోపలన్=హృదయమునందు,దుర్గుణంబు + ఎ=చెడుగుణమే, ప్రబలుంగద=వృద్ధియగునుగదా, అతనిన్=అదురాత్ముని, నమ్మఁగన్‌కూడదు=నమ్మరాదు, పాపటకాయకున్=పాపిడికాయకు, పైపయిన్=మీఁదుమీఁదుగా,నునుపు=ఉన్నతము,కల్గినన్=కలిగినను, కల్గున్ + గాక=ఉండునుగాని, దానిలోన్=అకాయలోపల, కల=ఉండినట్టి, విరుద్ధపు=వికటమగు, చేదు=విషము, ఏరూపునన్=ఏవిధమున, నశించున్=పోవును, (హరింపదనుట)

తా. పాపటకాయను మీఁదిభాగము నునుపుగానుండినను, దానిలో నుండిన చేదు పోనట్లు, దుష్టునకెంతయైనను సౌందర్యమున్నను హృదయములోని దుర్గుణములం మాత్రము పోవు. అట్టివానిని నమ్మఁగూడదు.

ఉ॥ పూనినభాగ్యరేఖ చెడి । పోయినపిమ్మట నెట్టిమానవుం
డైనను వాని నెవ్వరుఁ బ్రి।యంబునఁ బల్కరు పిల్వ రెచ్చటం
దానిది యెట్లొకో యనినఁ। దథ్యము పుష్పము వాడి వాసనా
హీనతనొందియున్న యెడ। నెవ్వరు ముట్టుదురయ్య భాస్కరా

టీ. భాస్కరా! పూనినభాగ్యరేఖ=తన్నుఁబొందిన యదృష్టపుగీత, చెడిపోయిన పిమ్మటన్ =పాడయిపోయిన తర్వాత, ఎట్టిమానవుండు + ఐనన్=ఎటువంటి గొప్పవాఁడైనను, ఎచ్చటన్=ఏప్రదేశమందైనను, వానిని =అయదృష్టహీనుని, ఎవ్వరున్=ఏమనుజులును, ప్రియంబునన్=అనురాగముచేత, పల్కరు=మాటలాడరు, పిల్వరు=రమ్మనరు, తథ్యము=సత్యము, తాన్=అది, ఎట్లు + ఒకో + అనినన్=ఏలాగుననిన, పుష్పము=సుమము, వాడి=ఎండిపోయి, వాసనాహీనతన్=సువాసన లేకపోవుటచేత, (పరిమళము) ఒంది=పొంది, ఉన్న + ఎడన్=ఉన్న సమయమందు, ఎవ్వరున్=ఏమనుష్యులయినను, ముట్టుదురు + అయ్య=తాకుదురా (స్పృశింపరు అనుట.)

తా. పుష్పము వాడిపోయి పరిమళహీనమైన సమయమున నెవ్వరును తాకనట్లే, అదృష్టరేఖ సన్నగిలిన మానవు లెంతఘనవంతులైనను దగ్గరకు రమ్మనక పోవుటయేగాక రమ్మని పిల్వరు.

ఉ॥ పూరిత సద్గుణంబుగల । పుణ్యున కించుక రూపసంపదల్
దూరములైనవాని యెడ । దొడ్డగఁ జూతురు బుద్ధిమంతులె
ట్లారయ గొగ్గులైనమరి । యందులమాధురిఁ జూచి కాదె ఖ
ర్జూరఫలంబులం బ్రియముఁ జొప్పడ లోకులు గొంట భాస్కరా.

టీ. భాస్కరా! పూరితసద్గుణంబు=పూర్ణమైన మంచిగుణములు కల పుణ్యునకున్=కలిగినట్టి పుణ్యవంతునకు, ఇంచుక=కొంచెము, రూపసంపదల్=అంద

ములయొక్క సమృద్ధులు, ధూరములు + ఐనన్=లేకున్నను, వానియెడన్= అట్టివానియెడల, బుద్ధిమంతులు=మంచివారు, దొడగన్=గొప్పగా, (ఘనముగా) చూతురు=చూచెదరు, ఎట్లు=ఏలాగునన(గా, అరయన్=ఆలోచింపగా లోకులు=మనుజులు, గొగ్గులైనన్=ముడతలుపడియున్నను, ఖర్జూరఫలంబులన్= ఖర్జూరపు(బండ్లను, ప్రియముచొప్పడన్=ప్రీతమగునటు కొంట=వెలకు(గొనుట, మఱి=ఇంతే(గాక, అందుల, ఆఫలములయందున్న, మాధురిన్= తియ్య(దనమును, చూచినకాదె=చూచిరేకదా.

తా. ఖర్జూరపు(బండ్లు(జూచుటకు( గొగ్గిగానున్ననుదానియందు(గల తియ్యదనము(జూచి జనులెల్లరును( బ్రేమించికొనునట్లు సద్గుణంబులు(గల వానికి సౌందర్యము లేకపోయినను సుజనులామనుజుని కడు గారవింతురు.

ఉ॥ ప్రల్ల(దనంబుచేనెఱుక • పాటొకయింతయు లేక యెచ్చటన్
బల్లిదు(డైన సత్ప్రభు నబద్ధ ములాడిన(ద్రుంగిపోదు; రె
ట్లల్లసభాస్థలింగుమతు • లై శిశుపాలు(డు దంతవక్త్రు(డుం
గల్లలు కృష్ణునింబలికి • కాదెహతంబగుటెల్ల భాస్కరా. 69

టీ. భాస్కరా! ప్రల్లదనంబుచేన్=బదరు(బోతు(దనముచే, ఎఱుకపాటు=వివేకము, (జ్ఞానము.) ఇంచుకవేత=కొంచమైనను లేక, ఎచ్చటన్=

---

69. శిశుపాల, దంతవక్త్రులు శ్రీహరి ద్వారపాలకులగు జయవిజయులు. సనకసనందన మహర్షుల శాపమువలన దైత్యులై జనించిరి. ఈశిశుపాల దంతవక్త్రులు కృష్ణునియందు బద్ధవైరము(గలవారై, ధర్మజరాజసూయయాగ కాలయందు నిలిచి కృష్ణమూర్తి పూజార్హుడు గాడని ప్రల్లదంబులాడి నంద నందనుని చక్రానలజ్వాలయందు(బడి శిశుపాలు(డుమరణించెను. అంత(గొంత కాలంబునకు దంతవక్త్రుని(గూడ( జంపెను.

ఎక్కడనైనను, బల్లిదుఁడు=పరాక్రమశాలి, ఏనసత్ప్రభునిన్=అయినట్టిమంచి రాజునుగూర్చి, అబద్ధములాడినన్=కల్లలాడినయెడల, క్రుంగిపోదురు=నాశన మగుదురు, ఎట్లు=ఏలాగుననఁగా, శిశుపాలుఁడు, దంతవక్త్రుఁడును. హతం బగుచెల్లఁ=చంపఁబడుటంతయును, అల్లసభాస్థలిన్ = (తొల్లి ధర్మజురాజ సూయయాగ మందలి) సభాభవనమున, కృష్ణునిఁ=కృష్ణభగవానునిఁగూర్చి కల్లలుపల్కి కాదె=నిందించుట వలననేకదా?

తా. యమనిందనుడైన ధర్మరాజు చేయు రాజసూయగ సభాస్థలం బున, శిశుపాల దంతవక్త్రులు శ్రీకృష్ణమూర్తిని నిందించి యాపరమాత్మని చేఁజచ్చిరి. అట్లె, అవివేకియైన మానవుఁడు బలశాలియగు రాజునుఁమాల నాడినఁ దప్పక మృతిఁ జెందును,

ఉ॥ ప్రేమనుఁగూర్చి యల్పునకుఁ • బెద్దతనంబును దొడ్డవానికిం
దామతి తుచ్ఛపుంబని నె • దంబరకింపక యీయరాదుగా;
వామకరంబుతోనగుడు • పంగుడిచేత నపానమార్గముం
దోమఁగవచ్చునేమిగుల • దోచనిచేతలుగాక భాస్కరా.70

టీ. భాస్కరా! ప్రేమనుఁగూర్చి=దయజూచి, అల్పునకుఁ=నీచునకు, పెద్దతనంబును=గొప్ప యధికారమును, దొడ్డవానికిఁ=యోగ్యునకు, తాము= భూమీశులైనవారు, తుచ్ఛపుంబని=హీనకార్యము, ఎదఁ=మనస్సునందు, పరికింపక=విచారింపక, ఈయరాదుగా=ఈయఁగూడదుకదా, ఎట్లనఁగా: మిక్కిలి, తోఁచనిచేతమిగులన్ కాక=బాగోగులునాలోచింపక, వామకరంబు తోడఁ=ఎడమచేతితో, పడుపఁ=భుజించుటయు, కుడిచేతన్=దక్షిణకరంబు అపానమార్గమున్=గుదస్థానమును, (మలమును విడిచెడిచోట)తోమంగఁ= కడుగుటయు, వచ్చునే=కూడునా? (తగదనియర్థము)

తా. లోకమునందు మానవులు ఎడమచేత భక్షించుటయు గుడిచేత గుదప్రక్షాళనము చేసికొనుటయు, దగనట్లుగా, రాజులు నీచునికి గొప్పయుద్యోగ మిచ్చుటయు, ఘనులకుఁ గొద్దియధికార మొసంగుటయుఁ గూడదు.

చ॥ ఫలమతిసూక్ష్మమైనను నృ ♦ పాలుఁడు మంచిగుణాఢ్యుఁడైనచో
నెలమి వివేకు లాతనిక ♦ పేక్షయొనర్తు; రదెట్లు చంద్రికా
విలసనమైనఁ దామనుభ ♦ వింపజకోరము లాసఁ జేరవే
చలువగలట్టివాఁడగుటఁ ♦ జందురు నెంతయుఁ గోరి భాస్కరా

టీ. భాస్కరా! నృపాలుఁడు=రాజు, మంచిగుణాఢ్యుఁడు=సద్గుణములచే నొప్పెడువాఁడు, ఐనచోనన్=అయినట్లయిన, ఫలము=లాభము, అతిసూక్ష్మము=మిక్కిలిదక్కువ, ఐనను=అయినప్పటికిని, వివేకులు=నీతికోవిదులు, ఎలమిన్=సంతోషముతో, అతనికిన్=ఆప్రభువునకు, అపేక్షయొనర్తురు=కోరుచుందురు, అది + ఎట్లు=అదియెలాగనఁగా, చంద్రికావిలసనము ఐనన్=వెన్నెలయొక్క ప్రకాశమానమైనను, చకోరము=వెన్నెలపులుఁగులు, చలువఁగల + అట్టివాఁడు=శీతలత్వముఁగలవాఁడు. అగుటన్=అయిన కారణముచేత, ఎంతయున్=మిగుల, చందురున్=శీతమయూఖుని, కోరి=కాంక్షించి, తాము=ఆచకోరపక్షులు, అనుభవింపన్=ఆవెన్నెలలు భుజించుటకు, ఆసన్=ప్రేమతో, చేరవే=ఆచందురుని సమీపమునకు వెళ్ళవా? (పోవునని యర్థము)

తా. వెన్నెల పులుఁగులు చంద్రునివలనఁ దివ్యప్రకాశమానమే గాని, విశేషలాభము లేకున్నను (చల్లనివాఁడను హేతువుచేనా తనిరాకఁ గోరునట్లు; ప్రభువు మంచివాడయినచో నాతనివలన ఫలమధికము లేకున్నను యపేక్షతో ప్రభువునే కోరుచుందురు.

ఉ॥ బంధురసద్గుణాఢ్యుఁడొక । పట్టునలంపటనొందియైన దు
స్సంధిదలంపఁడన్యులకుఁ । జాలహితంబొనరించుఁగాక శ్రీ
గంధపుఁజెక్క రాగిలుచుఁ । గాదె శరీరుల కుత్సవార్థమై
గంధములాత్మఁబుట్టఁదఱుఁగంబడియుండుటలెల్ల భాస్కరా,

టీ. భాస్కరా! బంధుర=ప్రకాశించెడి, సద్గుణ=మంచిగుణములకు, అధ్యుఁడు=అధిపతియైనవాఁడు, ఒకపట్టునన్=ఒకానొకసమయమందు, లంపటన్=కష్టమును, ఒందియైనను=వహించియైనను, అన్యులకున్=ఇతరులకుఁ హితంబున్=బాగును (మంచిని) ఒనరించున్=చేయును।గాని, దుస్సంధిన్=చెడును, (ప్రతికూలమగుపనిని) తలంపఁడు=యోచింపఁడు, ఎట్లనగా; శ్రీగంధపుఁ జెక్క=మంచిగంధపుఁ జెక్క, రాగిలుచున్=ప్రకాశమానమగుచు, గంధములు=పరిమళములు,ఆత్మన్=మనస్సులో, పుట్టన్=కలుగునట్లుగా. తఱుఁగంబడి=తగ్గిపోయియుండుట, ఎల్లశరీరులకున్=సకలజీవులకును ఉత్సవ + అర్థము=వినోదముకొఱకు, ఐకాదె-అయిరేకదా? (అవుననుట)

తా. మంచిగంధపుఁజెక్క పరిమళములు తనయందుఁగలుగునట్లుగా, హరించిపోవుచు జనులకుత్సాహంబుఁగలిగించునట్లు; సుజనాగ్రగణ్యుఁడు తానెన్నిసంకటములు పడుచున్నను, పరులకు హానసేయక మేలుఁగూర్చును.

చ॥ బలముఁదొలంగుకాలమునఁ। బ్రాభవసంపదలెంతధన్యుఁడున్
నిలుపుకొనంగనోప; డది । నిశ్చయమర్జునుఁడీశ్వరాదులం
గెలిచినవాఁడు బోయలకుఁ। గీడ్పడిచూచుచుఁగృష్ణుభార్యలం
బలువురనీయఁడే నిలుపఁ । బట్టసమర్థుఁడుగాక భాస్కరా! 73

టీ. భాస్కరా! బలము=దైవబలము, తొలంగుకాలమునన్=నశించెడివేళయందు, ఎంతధన్యుడున్=ఎటువంటి పుణ్యుఁడును, ప్రాభవసంప

దలఁ=మదైశ్వర్యములు,నిలుపుకొనంగన్=అపుకొనుటకు,చాలఁడు=సమర్థుఁడు కాజాలఁడు, అది=ఆకార్యము, నిశ్చయమే=సత్యమే, ఎట్లనఁగా; ఈశ్వరాదులన్=మహేశ్వరుఁడు మున్నగువారిని, గెలిచినవాఁడు=జయించినవాడైన అర్జునుఁడు=ధనుంజయుఁడు, బోయలకున్=చెంచువారలకు, కీడ్పడి=వశీకృతుఁడై, చూచుచు=కనుగొనుచు, పలువురన్=అనేకమందిని, కృష్ణుభార్యలన్=శ్రీకృష్ణమూర్తి యిల్లాండ్రను, నిలువఁబట్టన్=వారించుటకు, సమర్థుఁడు కాక=తగినవాడుఁగాక, ఈయఁడే=ఒప్పగించినాడు కాఁడా? (ఇచ్చెనని అర్థము.

తా. మహేశ్వరాదుల నోడించిన పాండవమధ్యముఁడు కృష్ణుని భార్యలను రక్షింప నసమర్థుఁడైనట్లు, విధిబలముఁ జాలనప్పు డెంతటి ఘనుఁడైననుఁ దనగౌరవమునుఁ గాపాడు కొనలేడు.

చ॥ బలయుతుఁడైన వేళ నిజ।బంధుఁడు తోడ్పడుఁగాని యాతఁడే
బలము తొలంగెనేని తన । పాలిటి శత్రు; వదెట్లుపూర్ణుఁడై
జ్వలనుఁడు కానఁగాల్చునెడఁ।సఖ్యముఁజూపును వాయుదేవుఁడా
బలియుఁడు సూక్ష్మదీపమగు।పట్టున నార్పదెగాలి భాస్కరా. 74

టీ. భాస్కరా! బలయుతుఁడు=శౌర్యవంతుఁడు, ఐనవేళన్,అయినకాలమందు, నిజబంధుఁడు=ప్రేమచుట్టము, తోడ్పడుగాని=సాయపడునుఁ

78. శ్రీకృష్ణబలరాముల నిర్యాణానంతరమునఁ జెంచువాండ్రు కృష్ణుని భార్యలనెత్తుకొని పారిపోవుచుండ నర్జునుండు నాబోయవాండ్రతో డీకొని సంగరమున నోడిపోవఁ బోయలా స్త్రీలనుఁ గొంపోయిరి. దైవానుగ్రహము లేని కతనఁ బశుపతిని గెల్చిన పార్థుఁడు బోయవాండ్రతో నోడిపోయెను.

గాని; అతఁడె=ఆచుట్టమే, బలము=శక్తిని, తొలఁగనేని=పాసెనేని, తన పాలిశత్రువు=తనకువిరోధియెయగును, అది + ఎట్లు=అది ఏలాగుననఁగా, జ్వలనుఁడు=వీతిహోత్రుఁడు, పూర్ణుఁడై=నిండినవాఁడై, కానన్=కాననమును (అరణ్యమును) కాల్చుతఱిన్=దహించెడి వేళయందు, వాయుదేవుడు=గాలి, సఖ్యము=చెలిమి=(మైత్రి) చూపును=చూపించునుఁగాని, అబలియుఁడు= బలశాలియగునాఅగ్నిదేవుఁడు, సూక్ష్మదీపము=చిన్నదివ్వె, అగుపట్టునన్= అయినప్పుడు, గాలి=వాయువు, ఆర్పదు + ఎ=పోఁగొట్టదా? (ఆర్పునని యర్థము)

తా. మిక్కిలి బలశాలియైన యగ్నిహోత్రుఁడటవిని దహించు వేళ యందుఁ బవనుఁడాతనికి దోడ్పడుచు, నాయగ్ని చిన్న దివ్వెయైనప్పుడా గాలియె విరోధియై, దానినార్పునటులఁ; జగంబున మానవుఁడు బల్లిదుఁడైయున్న కాలమున హితులుఁదోడ్పడుచు, బలముడిగినప్పుడు స్నేహితుఁడే విరోధియై నాశనకారి యగును.

ఉ॥ బల్లిదుఁడైన సత్ప్రభువు • పాయకయుండినఁగాని రచ్చలోఁ
జిల్లరవారు నూఱుగురు • సేరినఁ దేజముఁగల్గ దెయ్యెడన్
జల్లని చందురుండెడసి • సన్నపుఁజుక్కలు కోటియున్న రం
జిల్లునె వెన్నెలల్ జగము • చీకటులన్నియుఁ బాయ భాస్కరా.

టీ. భాస్కరా! బల్లిదుఁడు=పరాక్రమవంతుఁడు,ఐనసత్ + ప్రభువు= యోగ్యతఁగల రాజేంద్రుఁడు, రచ్చలోన్=సభలో, పాయక=విడిచిపోక, ఉండినఁగాని=ఉండినఁనేఁగాని, చిల్లరవారు=క్షుద్రవారు, నూఱుగురు=నూఱు మంది, చేరినన్=కూడినప్పటికిని, ఎయ్యెడన్=ఎక్కడను, తేజము=కాంతి, కలుగదు=లభింపదు,ఎట్లనఁగా;చల్లనిచందురుఁడు=శీతమయూఖుఁడు.ఎడసి= లేక, సన్నపుఁజుక్కలు=అల్పకాంతిఁగలతారలు, కోటి =కోటిసంఖ్య,

ఉన్న=ఉండినను, వెన్నెలల్=చంద్రకాంతులు, జగము చీకటులు అన్నియున్=లోకముయందలి యంధకారము లన్నియు, పాయక=పాసిపోవు నట్లు, రంజిల్లును+ఎ=వెలుఁగునా? (వెలుఁగవని యర్థము.)

తా. చంద్రోదయమున మంచివెన్నెలలు కాయునుఁగాని, చుక్క లెన్ని యున్నను ప్రపంచమందలి చీకట్లు పోవునటుల చంద్రిక వ్యాపింపదు అట్లే సత్ప్రభు వొక్కఁడుండిన సభ రంజిల్లును గాని, చిల్లరజను లెందఱున్ననుఁ గాంతి వహింపదు.

చ॥ భుజబలశౌర్యవంతులగు • పుత్రులఁగాంచిన వారి కెయ్యెడన్
నిజహృదయేప్సితార్థములు • నిక్కముచేకుఱుఁ గుంతి దేవికిన్
విజయబలాఢ్యుఁ డర్జునుఁడు • వీరపరాక్రమ మొప్ప దేవతా
గజమును దెచ్చి తల్లివ్రత • కార్యముదీర్పఁడె తొల్లిభాస్కరా.

టీ. భాస్కరా! భుజబల=బాహుబలము, శౌర్యవంతులు=పరాక్రమశాలు లగువారు, అగు పుత్రులన్=అయిన కుమారులను, కాంచినవారికిన్=కలిగిన వారికి, ఏ+ఎడన్=ఎక్కడైనను, నిజ + హృదయ + ఈప్సిత+అర్థములు= తన మనస్సునకు, ప్రియమైనపనులు, నిక్కము=సత్యముగ, చేకుఱున్= ఫలించును, ఎట్టులనఁగా; తొల్లి=పూర్వము, కుంతిదేవికి, విజయ=జయము చేతను, బల=పరాక్రమముచేతను, ఆఢ్యుఁడు=కూడియున్నవాఁడు, అర్జునుఁడు శ్వేతవాహనుఁడు, వీరపరాక్రమము=శౌర్యముఁతోఁగూడిన ప్రతాపము, ఒప్ప=విలసిల్లునట్లుగా, దేవతాగజమును=ఐరావతమును, తెచ్చి=కొనివచ్చి, తల్లివ్రతకార్యము, జననియొక్క వ్రతకార్యమును, తీర్పఁడు + ఎ=నెఱవేర్చిన వాఁడుకాఁడా? (నెరవేర్చెననుట.)

తా. కుంతీదేవికి మహా బలపరాక్రమశాలియగు నర్జునుండుండుటచేత నే మహేంద్రుని యైరావతంబునుఁ గొనివచ్చి తల్లివ్రతమును నెఱవేర్చినటుల

లోకంబున బలవంతులగు పుత్రులఁగాంచిన వారి కట్టి దుర్ఘట కార్యములయి నను నెఱవేఱును.

ఉ॥ భూనుతులైన దేవతలు • పూర్వము కొందఱు వావివర్తనల్
మాని చరింపరో యనుచు • మానవులట్లు చరింపఁబోల దం
భోనిధులన్నియుం దనదు • పుక్కిటఁబెట్టె నగస్త్యుఁడంచు నా
పూనిక కెవ్వఁడోపు నది • పూర్వమహత్త్వము సుమ్ము భాస్కరా

టీ. భాస్కరా! భూనుతులు=జగంబున మానవులచే స్తుతింపఁబడు దేవతలు, కొందఱు=కొంతమంది, పూర్వము=తొల్లి, వావి=వరుసయు, వర్తనల్=గౌరవములను, మాని=విడిచి, చరింపరు + ఓ=చరింప లేదా, అనుచున్=అనిపలుకుచు, మానవులు=మనుజులు, అట్లు + అ=అసురలవలె, చరింపన్=సంచరించుటకు, పోలదు=తగదు, ఎట్లనఁగా; అగస్త్యుఁడు=అగస్త్యమహాముని, అంభోనిధులు అన్నియున్=సముద్రములన్నిటిని, తనదు పుక్కిటను=తననోటి యందు, పట్టెను + అంచున్=ఉంచెనని, ఆపూనికకున్=ఆకార్యమునకు, ఎవ్వఁడు=ఏమనుజుఁడు, ఓపున్=తగియుండును, (సమర్థుఁడుకాఁడనుట) అది=అట్లుచేయుట, పూర్వమహత్త్వము సుమ్ము. పూర్వులయొక్క గొప్పతనము సుమీ.

తా. తొల్లి దేవతలు కొందరు చెడుమార్గములఁ బ్రవర్తించిరిగదా యని మానవులుగూడ దుష్కృతములు చేయఁగూడదు. అగస్త్యమహాముని సముద్రములఁగల జలమంతయుఁ బుక్కిటఁబట్టినట్లు మనుజులెవ్వరేనిఁబట్టుటకు సాహసింపఁగలరా?

ఉ॥ భూపతి కార్మబుద్ధి మదిఁ • బుట్టనిచోటఁ బ్రధానులెంతప్ర
జ్ఞాపరిపూర్ణులైనఁగాన • సాగదు కార్యము; కార్యదక్షులై

యోపిన ద్రోణభీష్మ కృప • యోధులనేకులుగూడి కౌరవ
క్ష్మాపతికార్యమేమయిన౯ • జాలిరెచేయఁగవారుభాస్కరా

టీ. భాస్కరా! భూపతికి౯=మహీపతికి, ఆత్మబుద్ధి=స్వకీయమైన బుద్ధి, మది౯=మనస్సునందు, పుట్టనిచోట౯=కలుగని ప్రదేశమున, ప్రధానులు=మంత్రులు, ఎంతప్రజ్ఞాపరిపూర్ణులు=ఎంత గొప్పబుద్ధితో నిండినవారు, ఐన౯=అయినను, కార్యము=పని, కొనసాగదు=నెఱవేఱదు, ఎట్టులనఁగా:- కార్యదక్షులు=పనులు కొనసాగింపసమర్థులైన, ఓపిన=తగియున్న, ద్రోణ=ద్రోణాచార్యుఁలు, భీష్మ=భీష్మాచార్యులు, కృప=కృపాచార్యులు, (మొదలుగాఁగల) యోధులు=వీరులు, అనేకులు=చాలమంది, కౌరవక్ష్మాపతి కార్యము=దుర్యోధనుని పని, చేయఁగ౯=నెఱవేర్చుటకు, చాలిరె + ఎ= తగిరే? (కార్యము సాధించలేరనుట.)

తా. కార్యాలోచన లేని సుయోధనుని పని నిర్వహించుటకుఁదగియున్నను భీష్మాదియోధులు చేయఁజాలనియట్లు ప్రభువునకు నిత్యమైన యాలోచనఁదలప నప్పుడు ప్రధానులెంత వివేకముఁగలవారయినను కార్యము నిర్వర్తింపఁజాలరు.

ఉ॥ భూరిబలాఢ్యుఁడైనఁదల • పోయక విక్రమశక్తిచేనహం
కారమునొందుటల్ తగవు • గాదతడొక్కెడమోసపోవుగా
వీరవరేణ్యుఁడర్జునుఁడు • వింటికి నేనధికుండనంచుఁ దా
నూరక వింటి నెక్కిడగ • నోపఁడుకృష్ణుడు లేమిభాస్కరా!79

టీ. భాస్కరా! తలపోయక=యోజనసేయక, భూరిబలాఢ్యుఁడు= మిక్కిలి బలవంతుఁడు, ఐన౯=అయినప్పటికిని, విక్రమశక్తిచే౯=పరాక్రమాతిశయముచే, అహంకారము=గర్వము, ఒందుటల్=పొందుటలు, తగవుఁగాదు=తగినదిగాదు, అతఁడు=బలవంతుఁడు, ఒక్క + ఎడ౯=ఒక్క

వోటు, మోసపోవుగా=హానిఁజెందుచుండునుఁగదా, ఎట్టులనఁగా: వీరవరే ణ్యుఁడు=బలశాలులలోనధికుఁడగు, పార్థుడు, వింటికిన్=బాణమునకు, నేనున్=నేను, అధికుండన్ + అంచున్=మిక్కిలి నేర్పుఁగలవాఁడననుచు కృష్ణుఁడులేమిన్=కృష్ణమూర్తి లేకుండుటచే, ఊరక=మిన్నక, వింటిన్= చాపమును, ఎక్కు + ఇడఁగన్=సంధించుటకయిన, ఓపఁడు=సమర్థుఁడు కాడు, (తగఁడని అర్థము.)

తా. పార్థుఁడు త్రిభువనములలోఁ దాను మేటి విలువిద్యా ప్రవీణుండనని గర్వించుచు, కృష్ణమూర్తి నిర్యాణానంతరము, బాణము నెక్కు పెట్టుటకైన సమర్థుఁడు కానట్లు, మనుజుండు తానెంత బల్లిదుఁడైనను, అందఱికన్న నేనే మిన్నయని గర్వపడఁగూడదు. అట్టి బలశాలిగూడ నొకానొకప్పుడు హానిఁజెందును.

ఉ॥ భ్రష్టునకర్థవంతులగు • బాంధవులెందఱుగల్గినన్ నిజా
దృష్టములేదు గావున ద • రిద్రతఁ బాపఁగ లేరు; సత్కృపా
దృష్టినినిల్పి లోకుల • కతిస్థిరసంపదలిచ్చు లక్ష్మియా
జ్యేష్ఠకదేటికిం గలుగఁ • జేయుముతోడనె పుట్టిభాస్కరా 80

టీ. భ్రష్టునకున్=పనికిమాలినవానికి, అర్థవంతులు=ధనవంతులు, అగు బాంధవుల్=అయిన చుట్టములు, గల్గినన్=కలిగియున్నప్పటికి, నిజాదృష్టము=తనయొక్క భాగ్యరేఖ, లేనుకావునన్=లేదుకాబట్టి, దరిద్రతన్=బీదతనమును, పాపఁగ లేరు=నశింపజేయజాలరు, ఎట్లనఁగా; సత్ + కృపాదృష్టిని=మంచిప్రేమతో గలిగినచూపును, నిల్పి=ఉంచి, లోకులకున్=మనుష్యులకు, అతి=మిక్కిలి, స్థిర=శాశ్వతమైన, సంపదలు=ఐశ్వర్యములు, ఇచ్చు లక్ష్మి=ఇదునట్టిలక్ష్మిదేవి, తోడనే=జెష్ఠతోగూడనె, పుట్టి=జన్మించి, జెష్ఠకున్=దరిద్రదేవతకు, ఆదేటికిన్=అదియేకారణమున,కలుగఁజేయదు=ఒసఁగదు. (భాగ్యము)

తా. శ్రీదేవి కరుణాకటాక్షవీక్షణములను జనులపై నిల్పిమిక్కిలిసంపదలొసంగుచుఁ దనతోఁబుట్టువగు దరిద్రదేవతను భాగ్యముల నీయనటుల; కొఱగానివానికి ధనాధిపతులు చుట్టములైనను వాని పేదరికమునుఁబాపఁజాలరు,

చ॥ మదిఁదనునాసపడ్డయెడ • మంచిగుణోన్నతుఁడెట్టిహీనునిన్
వదలఁడుమేలుపట్టున న • వశ్యము మున్ను గనాదరించుగా
త్రిదశవిమానమధ్యమున • దెచ్చికృపామతి సారమేయమున్
మొదలనిడండెధర్మజుఁడు•మూగిసురావళిచూడభాస్కరా 81

టీ. భాస్కరా! మంచిగుణోన్నతుఁడు=సద్గుణములచే నధికుఁడైనవాఁడు, తన్నున్=తన్నుగూర్చిన, మదిన్=మనస్సునందు, ఆసపడ్డయెడన్=ఆశించిన సమయమందు, ఎట్టిహీనునిన్=ఎటువంటి నీచుఁడైనను, వదలఁడు=విడిచిపెట్టఁడు, మేలుపట్టునన్=మంచియవసరమున, అవశ్యము=తప్పకుండ, మున్దుగన్=ముందుగా, ఆదరించున్ + కా=కరుణఁ జూచునుఁగదా,(ఎట్లనగా)ధర్మరాజు, కృపామతిన్=కరుణాస్వభావముతో, సారమేయమున్=కుక్కను, తెచ్చి=కొనివచ్చి, సురావళి=దేవతాసమూహము, పరివేష్టించి=

81. పరీక్షిత్తునకుఁ బట్టముగట్టిన తరువాత ధర్మరాజు సోదరులతోను భార్యంగూడి వనంబున కరుగుచుండ, భీమార్జున ద్రౌపదులు లోక్కరొక్కరు ప్రాణములు విడిచిపెట్టిరి. అదినుండి తన్ను వెంటాడి వచ్చుచున్న కుక్కమాత్రము వానితోఁ బోవుచుండెను. అట్లుఁజచ్చిన సోదరులకై చింతింపక మతిశాంతముగాఁబోయిన తరువాత, సురలు విమానారూఢులైవచ్చి, యిందునెక్కుమని ధర్మరాజునుఁ బ్రార్థింపగా, తన్నునమ్మి వచ్చుచున్న శునకమును ముందు గూర్చుండఁబెట్టి, తానునుఁగూర్చుండి దేవలోకమునకుఁబోయెను.

మూగి, చూడఁ=చూచుచుండఁగా, త్రిదశవిమాన మధ్యమునన్ = మానమునందు, మొదలన్=మొదటను, ఇడండు + ఏ=కూర్చుండఁబెట్ట లేదా (కూర్చుండఁబెట్టెననుట)-

తా. తన్ను నమ్మి వెంబడించి వచ్చుచున్న శునకమును ధర్మరాజు దేవతలచ్చెరువంద దేవతావిమానమునఁగూర్చుండఁబెట్టినట్లు,సుగుణవంతుఁడు ఎంతనీచుఁడైననుఁ దన్నాశ్రయించిన వానిని వదలక సమయముఁగల్గిన ప్పుడు ముందుగా నాతని నాదరించును.

ఉ॥ మాటలకోర్వఁజాలఁడభి • మానసమగ్రుఁడు ప్రాణహానియౌ
చోటులనైన దానెదురు • చూచుచునుండుఁగొలంకు లోపల
న్నీటమునింగినప్పుడతి • నీచములాడిన రాజరాజు పో
రాటమొనర్చి నేలబఁడ • డాయెనె భీముని చేతభాస్కరా 82

టీ. భాస్కరా! అభిమాన సమగ్రుఁడు=అభిమానముచేనిండిన వాఁడు ప్రాణహాని=జీవముల కపాయము, ఔచోటులనైనన్=అగునట్టిప్రదేశములయందు నైనను, తాను=అ యభిమాన ధురంధరుఁడు, ఎదురు చూచు చుండున్=నిరీక్షించుచుండునుఁగాని, మాటలకున్=పలుకులకు, ఓర్వఁజాలఁడు=సహింపలేడు, రాజరాజు=దుర్యోధన మహారాజు, కొలంకులోపలన్=మడుగులోపల, నీటమునింగినప్పుడు=జలమునఁ దాఁగినప్పుడు, అతి=మిగుల, నీచములాడినన్=పరుషోక్తులాడిన, పోరాటము=యుద్ధము,(రణము) ఒనర్చి=సలిపి, భీముని చేత=వాయునందనుని చేత, నేలన్=ధరయందు, పడఁడాయెన్=పడలేదా? (మృతినొందినాడనుట)

తా. దుర్యోధనుఁడు సమస్తమునుఁ గోలుపోయి ప్రాణభీతిచే నొక కొలనులో జలస్తంభన విద్యచేఁ దాఁగియుండి పాండవుల నిష్ఠురాలాపముల సహింపలేక రణమొనర్చి, భీముని గదాఘాతములచేఁ దొడలు విఱిఁగి

మృతిఁజెందినట్లుఁ అభిమానవంతుఁడు ప్రాణములనైనఁ బాయునుగాని పరుల దూషణలను సహింపఁజాలఁడు.

ఉ॥ మానవనాథుఁడాత్మరిపు • మర్మమెఱింగినవాని నేలినం
గాని జయింపలేఁ డరులఁ•గార్ముకదక్షుఁడు రామభద్రుఁడా
• దానవనాయకున్ గెలువఁ• దానెటు లోపుఁదదీయ నాభికా
స్థానసుధన్విభీషణుఁడు• తార్క్ష్యని చెప్పకయున్న భాస్కరా. 83

టీ. భాస్కరా! మానవనాథుఁడు=ధరాధిపతి, (ప్రభువు) ఆత్మరిపు మర్మమున్=నిజవిరోధియొక్క రహస్యమును, ఎఱింగిన వానిని=తెలిసికొనిన వానిని అరులన్=శత్రువులను (పగతురను) జయింపలేఁడు=చంపఁజాలఁడు ఎట్లనఁగా; విభీషణుఁడు=రావణుని తమ్ముఁడు, తార్క్ష్యని=(శ్రీరాముని) దరిఁజేరి, తదీయ=రావణుని సంబంధమైన, నాభికాస్థాన=బొడ్డుయందున్న, సుధన్=అమృతకలశమును, చెప్పకయున్నన్=చెప్పకుండినచో, కార్ముక దక్షుఁడు=దనుర్విద్యాపారంగతుఁడైన, రామభద్రుఁడు = రఘురాముడు• గెలువఁగన్=జయించుటకు, ఎటులు + ఓపున్=ఎట్లు శక్తుఁడగును? (సమర్థుడు కాడనుట).

తా. రావణుని వక్షస్థలమున నమృతముఁగలదని విభీషణుఁడు శ్రీరామమూర్తికి నెరుకఁజేయకయున్న, నెంతటి ధనుర్విద్యాకౌశలుఁడైనను రావణుని జయింప సాధ్యము కానటుల; రాజునకు శాత్రవమర్మమెఱిఁగిన సేవకుఁడు లేనియెడల నాపృధివీపతి పగతుర జయింపఁజాలఁడు.

---

83. శ్రీరాముఁడు రావణసంహారముఁజేయ నెంతఁ బ్రయత్నించినను సాధ్యముఁ గాకపోవుటచే, రావణుని హృత్కమలమునఁ గల యమృతము భేదించినఁ జచ్చునని విభీషణుఁడుఁ జెప్పఁగా, నంత రామచంద్రుఁడాగ్నేయాస్త్రమునుఁ బ్రయోగించి, యమృతమును హరించి, పిదప నాదనుజుని యవలీలఁగాఁ జంపివేసెను.

ఉ॥ మానవుఁడాత్మకిష్టమగు • మంచిప్రయోజన మాచరించుచో
గానక యల్పుఁడొక్కఁడది • గాదని పల్కినవాని పల్కుకై
మానఁగఁజూడఁ డావని సు• మంచితభోజనవేళ నీఁగకా
లూనినవంటకంబుఁదిన•కుండఁగనేర్పగునోటుభాస్కరా. 84

టీ. భాస్కరా! మానవుఁడు=మనుష్యుఁడు, (మర్త్యుఁడు)ఆత్మకున్ మనస్సునకు=(చిత్తమునకు) ఇష్టము=హితము, అగు మంచి ప్రయోజనము—అయినట్టి మంచి కార్యము, ఆచరించుచోన్ = ఒనరించు సమయమందు, అల్పుఁడు=నీచుఁడు ఒక్కఁడు కానక=ఆకార్యమువలన ఫలితము నెఱుంగక, అది=అపని. కానని=చేయఁగూడదని, పల్కినన్=నుడివినచో, వాని పల్కుకై=వాని పలుకులకోసము, అపని=అప్రయోజనము, మానగన్=విడిచిపెట్టుటకు, చూడఁడు=యోచింపడు. యెట్లనఁగా; సమంచిత=మంచి భోజనవేళన్=భక్షణ సేయుకాలమందు, ఈఁగకాలు + ఊనినవంటకము=ఈఁగకాలుమోపిన, వంటకంబు=తినెడి పదార్థము, తినకుండగన్=భుజింపమానుట నేర్పు + అగునోటు=నేర్పరితనమగునా? (కాదని యర్థము.)

తా. మానవుఁడు భుజించునప్పుడా యన్నముపై నీఁగ వ్రాలినంత మాత్రమున నావంటకమును విడువక భుజించునట్లు; తన కిష్టమైన కార్యమునుఁ మనుజుఁడు గావించునప్పుడొక నీచుఁడు వలదని వచించినను తత్కార్యమును విడువరాదు

ఉ॥ మానినిచెప్పు న న్విను కి• మాలినవాఁడటుచేసినన్ మహా
హానిఘటించు నేఘనుని • కైన నసంశయ ముర్విపైఁ గృపా
హీనతఁబల్కినన్ దశర • థేశ్వరుఁడంగనమాటకై గుణాం
భోనిధిరాముఁ బాసి చని•పోవఁడె శోకముతోడభాస్కరా. 85

టీ. భాస్కరా! ఎఱుకమాలినవాఁడు=అవివేకియగువాఁడు, మానిని=తనభార్య, ఎట్లు చెప్పను=ఏరీతిగాఁ బలుకునో, అటుచేసినన్=ఆప్రకారముగ నాచరించినయెడల, ఉర్విపైన్=భూమియందు, ఏఘనునికైనను=ఎంత గొప్పవానికయినను, మహాహాని=గొప్పయాపద, ఘటించున్=సంభవించును, అసంశయము=సందియ మెంతమాత్రమును లేదు, ఎట్లనఁగా; కృపాహీనతన్=ప్రేమ లేకపోవుటచే, పలికినన్=చెప్పఁగా, అంగనమాటకై, భార్యయగు కైకేయి వచనములకు, దశరథ + ఈశ్వరుఁడు=దశరథమహారాజు=గుణాంభోనిధిన్=గుణసముద్రుని, రాముని=రామభద్రుని, పాసి=వదలి, శోకమున్=తోడన్=దుఃఖభరముచే, చనిపోఁడే=ప్రాణములఁబాయలేదా ? (చచ్చెనని యర్థము.)

తా. దశరథమహారాజు, భార్యయగు కైకేయి యాజ్ఞాప్రకారము సుగుణధాముఁడగు శ్రీరాముని గుట్టలఁబట్టించి, తద్వియోగములను భరింపలేక ప్రాణంబులఁ గోలుపోయినట్లే, అవివేకియగువాఁడు, భార్యానుసారముగఁ బ్రవర్తించినచోఁ దానెంతటి ఘనుఁడైనను, గొప్పయాపదలకు బాల్పడును.

చ॥ మునుపొనరించు పాతకము • మోఘము జీవులకెల్లఁబూనియా
వెనుకటి జన్మమందనుభ • వింపక దీఱదు; రాఘవుండు వా
లినిబడనేసి తా మగుడ • లీల యదూద్భవుఁడై కిరాతుచే
వినిశితబాణపాతమున • వీడ్కొనఁడే తన మేను భాస్కరా. 86

టీ. భాస్కరా! మునుపు=పూర్వము, ఒనరించుపాతకము=జేసినను దుష్కర్మము, అమోఘము=వృథాకాదు, జీవులకున్ + ఎల్లన్=సమస్తప్రాణులకు, పూని = ప్రయత్నించి, ఆ వెనుకటి జన్మమందున్=తరువాత జన్మమందును, అనుభవింపక = పొందక, తీరదు = కనుపడదు, (అనుభవింపకఁ

దప్పదు.) (ఎట్లనఁగా) రాఘవుండు=శ్రీరాముఁడు, వాలిని=వాలియను మర్కటప్రభువును, పడక + ఏక=మృతినొంది, తాక=తాను, రాముఁడు మగుడక=మర్ల, లీలక=విలాసముగ, యదూద్భవుఁడు + ఐ=యాదవకుల మునఁబుట్టినవాఁడయి, కిరాతుచేక=బోయవానిచేత, వినిశిత=పదునైన, బాణ=బాణముయొక్క, పాతమునక=దెబ్బచే, తనమేను=తనశరీరమును, వీడ్కొనఁడు + ఎ=విడిచిపెట్టలేదా? (మృతిఁజెందెననుట).

తా. రామమూర్తి వాలినిఁజంపిన పాతకంబుచేఁ గృష్ణావతారమున నెఱుకవానిబాణపాతముచే దేహమును విడిచిపెట్టినట్లు; ఎంతటిమహానుభావుఁ డైనను తొలిజన్మమునఁ జేసిన పాపఫలమును మరల జన్మమున ననుభవింపక దీరదు.

ఉ॥ రాకొమరుల్ రసజ్ఞునిఁ ది • రంబుగ మన్ననునుంచినట్లు భూ
లోకమునందు మూఁఢు దమ • లోపలనుంపరు; నిక్కమేకదా
చేకొని ముద్దుగాఁ జదువు • చిల్కను బెంతురుగాక, పెంతురే
కాకమునెవ్వరైన శుభ • కారణ సన్మునిసేవ్య భాస్కరా. 87

టీ. శుభకారణ=మంగళప్రదమునకాధారమైనవాఁడా! సత్ + ముని సేవ్య=సన్మునిశ్వరులచే స్తుతింపఁబడువాఁడా! రాకొమరుల్=రాజకుమారులు, మన్ననక=గౌరవముతో( తిరంబుగక=నిలుకడగా, (స్థిరముగ) రసజ్ఞునిక= రసికుని, ఉంచినట్లు=నిలుపుకొనినట్లు, భూలోకమునందుక=ధరలో, మూఢు

---

86. వాలి=సుగ్రీవుని కగ్రజుఁడు. వీరిరువురు నింద్రసూర్యులవలన యహల్య యందుఁబుట్టినవారు. గౌతమునిశాపమువలనఁ గోఁతులైరి. సీతాన్వేషణంబున సుగ్రీవుఁడు రాముని శరణుఁగోరుటచే, సీతామనోహరుఁడు వాలినొకకోలచే గూలఁజేసెను.

=మూర్ఖుని, తమలోపలన్=తమగృహములో, ఉంపరు=ఉంచుకొనరు, నిక్క-
ము + ఎ=నిజమేకదా! (ఎట్లనఁగా) ఎవ్వరైనన్=ఎటువంటివారయినను,
చేకొని=కరమునఁబట్టుకొని, ముద్దుగన్=ముచ్చటగా, చదువు=పఠించు
చున్న, చిలుకను=శుకమును, పెంతురుగాని=పోషింతురుగాని, కాకమున్=
వాయసమును, పెంతురా=పెంచెదరా? (పెంచరనుట).

తా. లోకములో మనుష్యులు ముద్దుపలుకులఁ బలుకుచుండెడి చిలుకను
బెంచెదరుగాని, కాకినిఁ బెంచరు. అట్లే, ప్రభువులు రసజ్ఞతఁగలవారి నాద
రింతురుగాని, మూర్ఖులఁ జేరఁదీయరు.

ఉ॥ లోకములోన దుర్జనుల । లోతునెఱుంగక చేరరాదు సు
శ్లోకుఁడు చేరినం గవయుఁ జూతురు చేయుదు రెక్కసక్కెముల్
కోకిలఁ గన్నచోట గుమిఁగూడియసహ్యపుఁగూతలార్చుచుం
గాకులు తన్నవే తఱిమి కాయము తల్లడమంద భాస్కరా. 88

టీ. భాస్కరా! లోకమునన్=లోకమందు, సుశ్లోకుఁడు=సత్కీర్తిఁ
గలవాఁడు, దుర్జనులలోతును=ఖలుల యభిప్రాయమును, ఎఱుంగక=తెలిసి
కొనక, చేరరాదు=దరిఁజేరఁగూడదు, చేరినన్=ఒకవేళఁబోయినయెడల,
కవయున్=కలియఁబడును, చూతురు=ఆలోచింతురు, ఎక్కసక్కెముల్=
వికటపుమాటలు, (వేళాకోళపుఁ బలుకులు) చేయుదురు=వచింతురు, ఎట్ల
నఁగా; కాకులు, కోకిలన్=కోయిలను, కన్నచోటన్=చూచినతావునందు,
గుమిగూడి=ప్రోవయి, అసహ్యపుగూతలు=చెడుకూతలను, ఆర్చుచున్=
కూయుచు, కాయము=(దాని) శరీరము, తల్లడము + అందన్=భీతులునట్లు
గా, తఱిమి=వెన్నాడి, తన్నవె=తన్నవా? (పాదములతోఁదాడించుననుట)

తా. లోకమున మంచివాఁడు దుర్జనుల యూహాను గ్రహించకుండ
వారలఁ జేరరాదు. అటులఁజేరినచోఁ గాకులు కోకిలమును గాంచినంత నేఁ

జుట్టుముట్టి కేకలు వేయుచు వెంబడించి పదతాడనముఁ గావించునట్లు, దుష్టాత్ములు సజ్జనుని దఱిఁజేరి యపహసింతురు.

ఉ॥ లోనుదృఢంబుగాని పెనులోభిని నమ్మియసాధ్యకార్యముల్
కానక పూనునేనతఁడు ♦ గ్రక్కునఁగూలును; నోటిపుట్టిపై
మానవుఁడెక్కిపోవ నొకమాటుబుటుక్కున ముంపకుండునే
తానొకలోతునంగెడసి ♦ దానిఁదరింపఁగలేక భాస్కరా. 89

టీ. భాస్కరా! లోను=మనస్సు, దృఢంబుగాని=గట్టిదికాని, పెను లోభిని=మిక్కిలిఁ బేరాసఁగలవానిని, నమ్మి=విశ్వసించి, అసాధ్య=సాధింప శక్యముగాని, కార్యము=పనులను, కానక=ఎఱుంగక (తెలిసికొనక) పూను నేని=ప్రయత్నించునేని, అతఁడు=ఆమనుజుఁడు, గ్రక్కునన్=తత్క్షణమే, కూలున్=నాశనమగును, ఎట్లనఁగా; మానవుఁడు=మనుష్యుఁడు, ఓటిపుట్టి పైన్=మిక్కిలిశిథిలమైన పడవమీదను, ఎక్కి=అధిరోహించి, పోవన్= వెళ్లఁగా, తాను=ఆపడవ, అప్రవాహమును తరింపన్ + కన్ లేక=దాటలేక ఒకమాటు=ఒకసారి, బుటుక్కునన్=బుటుక్కుమని, ముంపక + ఉండును + ఎ=దానిపైనున్న మర్త్యుని ముంపకుండునా? (ముంచివేయుననియర్థము.)

తా. శిథిలమగు పడవమీఁద మనుష్యుఁడెక్కి గంభీరమగు నొక జల ప్రవాహమును దాట యత్నించెనేని, యాపడవ జలంబుచందొరగి వానిని ముంచివేయునట్లు; మనుజుఁడు కడులోభివానిని విశ్వసించి కార్యనిర్వాహణకైఁ బ్రయత్నించెనేని వానిమూలమునఁ దప్పక నశించును.

ఉ॥ వంచనయింతలేక యొటువంటి మహాత్ముల నాశ్రయించినన్
గొంచెమొకాని మేలు సమకూడ దదృష్టములేనివానికిన్
సంచితబుద్ధి బ్రహ్మ వనిశంబును వీఁపున మోఁచునట్టి రా
యుంచమదమ్మితూఁడ్లుఁదిననాతొఁగటాఫలమేమిభాస్కరా

టీ. భాస్కరా! వంచన=శక్తివంచన, (కృత్రిమము) ఇంత లేక=కొంచెమైనను లేకుండ, ఎటువంటిమహాత్ములన్=ఎంతటిమహానుభావులను, ఆశ్రయించినన్=భక్తిశ్రద్ధలఁ జేరినను, అదృష్టము లేనివారికిన్=అభాగ్యులగు మానవులకు, కొంచె మె కాని=కొద్దియేఁగాని, మేలు=మంచి, సమకూడదు=ప్రాప్తించదు. ఎట్లనఁగా; సంచితబుద్ధిన్=పూర్వార్జితజ్ఞానముచేత, అనిశంబున్=నిత్యమును, వీపునన్=వెన్నుచేత, బ్రహ్మను=నలువను, మోచునట్టి=మోయుచున్న, రాయంచయున్=రాజహంసయు, తమ్మితూండ్లు=నుంపతూండ్లు, (తామరకాడలు) తినఁగా రోయఁగదా=భక్షించుటయయ్యెఁగదా! ఫలము=లాభము, ఏమి=ఏమికలదు? (ఫలము లేదనుట.)

తా. లోకమును సృజించెడి బ్రహ్మననిశంబును దనవీపుపైనిడుకొని మోయుచున్న రాజహంస తామరతూండ్ల నాహారముఁ జేసికొనినట్లు; అదృష్టహీనుఁ డెంతటిభాగ్యవంతునిఁ జేరినను విశేషలాభము లేదు.

ఉ॥ వట్టుచుఁదండ్రి యత్యధమ • వర్తనుఁడైననుగాని వానికిం
బుట్టినపుత్రకుండు తన • పుణ్యవశంబున దొడ్డధన్యుఁడౌ;
నెట్టనమఱ్ఱివిత్తు మును • పెంతయుఁగొంచెము దానఁబుట్టు నా
చెట్టు మహోన్నతత్వమునుఁ • జెంద దె శాఖలనిండి భాస్కరా.

టీ. భాస్కరా! తండ్రి=జనకుఁడు, వట్టుచున్=కృశించుచు, అతి=మిక్కిలి, అధమవర్తనుఁడు=దుష్ప్రవర్తనఁగలవాఁడు, ఐనన్ + కాని=అయినప్పటికిని, వానికిన్=అయ్యధమప్రవర్తకునకు, పుట్టినపుత్రుఁడు=జన్మించినకొమారుఁడు, తనపుణ్యవశంబునన్=తొల్లి చేసినపుణ్యమువలన, దొడ్డధన్యుఁడు=గొప్పకృతార్థుఁడు, ఔన్=అగును, ఎట్టు + అనన్=ఏలాగుననఁగా, మఱ్ఱివిత్తు=వటబీజము, మును పు=పూర్వము, ఎంతయున్=మిక్కిలి, కొంచెము=చిన్నది, దానన్=అవిత్తునందు, పుట్టునా చెట్టు=పుట్టినయామఱ్ఱిచెట్టు,

శాఖలన్=కొమ్మలచేత, నిండి=విజృంభించి, (అవరింపఁబడి) మిగులపొడ వును, చెందను + ఎ=పొందదా? (పొందునని యర్థము.)

తా. మఱ్ఱివిత్తు కొద్దిదైనను దానినుండి పుట్టినది గొప్పవృక్షమగునట్లు జనకుఁడు యల్పుఁడైనను వానికిఁగలిగిన కుమారుఁడు పూర్వపుణ్యముచే దొడ్డ వాఁడగును.

చ॥ వలనుగఁ గానలందుఁ బ్రతివర్షమునం బులి నాలుగైదు పి
ల్లలఁగను దూడనొక్కటి నిలంగనుధేనువు రెండుమూడు నేఁ
డుల కటులైన బెబ్బులికుటుంబము లల్పములాయె నాలమం
దలుగడువృద్ధిఁజెందవెఱయధర్మముధర్మముఁదెల్పభాస్కరా

టీ. భాస్కరా! వలనుగన్=బాగుగా, కానలందున్=అడవులయందు, పులి=వ్యాఘ్రము, ప్రతివర్షమున్=ఏఁటేఁటను, నాలుగైదుపిల్లలన్= నాలుగేసి, అయిదేసికూనలను, కనున్=కనుచుండును, (ప్రసవించును.) ధేను వు=గోవు, రెండుమూడు నేడులకున్=రెండేసి, మూడేసివత్సరములకు, దూడ నొక్కటిన్= ఒకలేగను, మాత్రమే, కనున్=ఈనుచున్నది, అటులైనన్= అవిధముగానైనను, అధర్మమున్=(పులుల) అన్యాయమును, ధర్మమున్= (అవుల) ధర్మమును, తెల్పన్=తెలియఁజేయుటకు, బెబ్బులికుటుంబములు= వ్యాఘ్రముల సంతానవృద్ధి, అల్పములు + ఆయెన్=తక్కువాయెను, ఆలమం దలు=గోసమూహములు, కడున్=మిక్కిలి, వృద్ధిన్ + చెందవు + ఎ = అభివృద్ధిపొందలేదా? (వృద్ధియగునని అర్థము.)

తా. దుష్టప్రవర్తనగల మృగములు ప్రతిసంవత్సరమును నాలు గైదు పిల్లలనుఁబెట్టుచున్నను వాటిసంతతి వృద్ధిగాంచకున్నది. ధర్మప్రవృత్తిగల యావులురెండుమూడేండ్ల కొక్కొకదూడనుఁగలిగినను వాటిసంతతి మిక్కిలి

యభివృద్ధిఁగాంచుచున్నది. అట్లే, అధర్మవర్తనఁగలవానివంశము పాడగును. ధర్మబుద్ధిగలవానివంశము వృద్ధిఁజెందఁగలదు।

చ॥ వలవదు క్రూరసంగతి య । వశ్యమొకప్పుడు సేయఁబడ్డచోఁ
గొలఁదియె కాక యెక్కువలు । గూడవు; తమ్మలపాకులోపలం
గలసినసున్నమించుకయ । కాకమతించుక యెక్కువైనచో
వలుగడఁజుట్టుచుట్టుమని । నాలుకపొక్కకయున్నె భాస్కరా.

టీ. భాస్కరా! క్రూరసంగతి=చెడ్డస్నేహము, అవశ్యము=ముఖ్యము వలవదు=మానవలెను. ఒకప్పుడు=ఒకసమయమందు, చేయఁబడ్డచోన్=చేసినయెడల, కొలఁదియె కాని, కొంచెమే గాని, ఎక్కువలు = అధికముగాజేయుటలు, కూడవు=చెల్లవు, ఎట్లనఁగా; తమ్మలపాకులో=తమలపాకులందు, కలచినసున్నము=రాచినసున్నము, ఇంచుకయు కాక=కొంచెమైన, గాని, మతించుక=ఇకఁగొంచెము, ఎక్కువైనచోన్=అధికమైనయెడల, వలుగడలన్=నలువైపుల, నాలుక=జిహ్వ, పొక్కక+ఉన్నె=పొక్కకుండునా? (బొబ్బలెక్కకనుట.)

తా. దుర్జనసహవాసము తప్పక విడిచిపెట్టవలెను. సందర్భానుసారముగఁ జేయవలసివచ్చినను అంటియంటక నుండవలెను. అధికానురాగము తమలపాకులయం దెక్కుడుసున్నము పడినయెడల నాలుకపొక్కి బాధించునట్లు కీడుఁగలుగును.

ఉ॥ వానికివిద్యచేత సిరి । వచ్చెనటంచును విద్యనేర్వఁగాఁ
బూనినఁబూనుఁగాక తన । పుణ్యముచాలక భాగ్యరేఖకుం
బూనఁగనెవ్వఁడోపు; సరి । పోఁడవి పెంచునుఁగా కదృష్టతా
హీనుఁడుకర్ణభూషణము । లెట్లుగడింపఁగనోపు! భాస్కరా. 94

టీ. భాస్కరా! వానికిఁ=అపూరుషునకు, విద్యచేతఁ=చదువువలన, సిరి=సంపద, వచ్చెఁ + అటంచుఁ=కలిగినదని, విద్యఁ=చదువును, నేర్వఁ + కాఁ=అభ్యసించుటకు, పూనినఁ + పూను + కొక=ప్రయత్నించిన యత్నించుచునుగాక, తనపుణ్యము=పూర్వజన్మవలనఁ గలిగిన సుకృతము, చాలక=సరిపోకున్నచో; భాగ్యరేఖకుఁ=అదృష్టపు గీతనిమిత్తము, పూనఁగఁ=ప్రయత్నించుటకు, ఎవ్వఁడు=ఏమనుష్యుఁడు, ఓపుఁ=సమర్థుఁడగును, (అనఁగాఁ గాఁడని యర్థము.) సరిపో=సరేకాని, అదృష్టతాహీనుఁడు=భాగ్యము లేనివాఁడు, చెవిపెంచునుఁగాక=చెవికన్నమును పెంచునుగాక కర్ణభూషణములు=కర్ణాభరణములు, గడింపఁగఁ=సంపాదించుటకు, ఎట్లు + ఓపుఁ = ఏరీతి సమర్థుఁడగును, (తగదని యర్థము:)

తా. భాగ్యహీనుఁడగు మనుష్యుఁడు కర్ణముల కన్నముఁ బెంచినఁ బెంపఁగలఁడు గాని, కర్ణకుండలములు సాధింప నేరనట్లు చదువువలన నొకరికి సంపదలు ప్రాప్తించినవని, తానుఁగూడ విద్యాభ్యాస మొనర్చి ధనార్జనఁ జేసినఁ జేయఁగలఁడు కాని, తొల్లింటి సుకృతము లేనిదే యైశ్వర్యమును సంపాదింపఁజాలఁడు

ఉ॥ సంతతపుణ్యశాలి నొక • జాడనుసంపద వాసిపోయి తా
నంతటఁ బోక నెట్టుకొని • నెప్పటియట్ల వసించియుండు; మా
సాంతమునందుఁ జందురుని • నన్నికళల్ పెడఁబాసిపోయినం
గాంతివహింపఁడోటుదితుఁ•గంబడి దేహమునిండభాస్కరా! 95

టీ. భాస్కరా! సంపద=ఐశ్వర్యము, సంతత=మిగుల, పుణ్యశాలిన్=సుకృతముచే నొప్పువానిని, ఒకజాడను=ఒకవిధముగా. పాసిపోయి=విడిచిపోయి, తాఁ=ఆ భాగ్యము, అంతటన్ + పోక= అంతమాత్రమునఁబోక, నెట్టుకొని=పొదుకొని, అప్పటియట్ల=వెనుకటిరీతి నె. వసించియుండుఁ=

నివసించియుండును, ఎట్లనఁగా; మాస + అంతమునందున్=అమవసనాఁడు, చందురున్=కలువలరేయిని, అన్నికళల్=పదునారుకళలు, పెడబాసిపోయి నన్=విడిచిపోయినను, తిరుగంబడి=మరల, (పగుడ) దేహము=బింబము,నిండన్=పూర్ణమగునట్లుగా, కాంతిన్=కళను వహింపఁడు + ఓటు=పొందఁడా? (చెందునని యర్థము.)

తా. చంద్రుని కళాపూర్ణమంతయు మాసాంతమున వదలిపోయినను తనకళామృతమును సురలకిచ్చినట్టి సుకృతముచే వెండియుఁ గ్రమక్రమముగా సహజకళను సంపూర్ణముగఁ బొందునట్లు, ప్రతిదినమును పుణ్యములనుఁ జేయువాని కొకరీతిగా సిరిలభించును.

చ॥ సకలజనప్రియత్వము ని • జంబుగఁగల్గినఁ బుణ్యశాలి •కొ
క్కొకయెడ నాపదైనఁదడ • వుండదు వేగమెపాసిపోవుగా
యకలుషమూర్తియైనయమృ• తాంశుడు రాహువుతన్ను మింగినం
డకటకమానియుండడె? దృ•ఢస్థితినెప్పటియట్లభాస్కరా. 96

టీ. భాస్కరా! సకలజన ప్రియత్వము=జనులందరియొక్క ప్రేమకుఁ బాత్రుండైయుండుట, నిజంబుగన్=నిశ్చయముగా, కల్గినన్=కల్గినయట్టి పుణ్యశాలికిన్=పుణ్యాత్మునకు, ఒక్కొక్కయెడన్=ఒకానొకవేళయందు, ఆపద=ఇక్కట్టు, ఐనన్=కలిగినను, తడవుఉండదు=ఎక్కువకాలము నిలువదు, వేగమున + ఎ=తత్క్షణమే, పాసిపోవున్=నశించునుగదా, ఎట్లనఁగా, అకలుష=నిష్కళంకమైన (కళంకరహితమైన) మూర్తి=రూపముఁగలవాఁడు ఐన + అమృత + అంశుడు = అమృతకిరణుండైన చంద్రుఁడు, తన్నున్= తన్ను, రాహువు=రాహువుఅనెడి గ్రహము, మింగన్=మింగినప్పటికిని, టకటక=తొందరపాటును, మాని=విడిచి, దృఢస్థితిన్=స్థిరమైనయునికిచేత, ఎప్పటియట్ల=మునుపటివలెనె, ఉండదు + ఎ= కళాపూర్ణుఁడైయుండడా? (ఉండునని యర్థము.)

తా. అకలుషమూర్తియగు చంద్రుఁడు రాహువుచే మ్రింగఁబడి కళా రహితుఁడైనను, మరలఁ గొద్దికాలములోనె సహజకాంతినిఁ గాంచునట్లు; ప్రజానుకూలుండైన వాని కొకప్పుడుఁ జిక్కులు తటస్థించినను, వెంటనే సుఖోపవిష్టుండగును.

ఉ॥ సన్నుతకార్యదక్షుఁడొక • చాయ నిజప్రభ యప్రకాశమై
యున్నపుడైన లోకులకు • నొండొకమేలొనరించు సత్వసం
పన్నుఁడు భీముఁడాద్విజుల • ప్రాణముకావఁడె యేకచక్రమం
దెన్నికగా బకాసురుని • నేపునరూపడఁగించి భాస్కరా. 97

టీ. భాస్కరా! సన్నుత=స్తుతింపఁబడుచున్న (పొగడఁబడుచున్న) కార్య=పనియందు, దక్షుఁడు=సమర్థుఁడైనవాఁడు, ఒకచాయన్=ఒకపట్టున నిజప్రభ=తనకాంతి, అప్రకాశము+ఐ=స్పష్టముకానిదై, ఉన్నపుడు + ఐనన్=ఉన్నసమయమందైనను, లోకులకున్=జనులకు, ఒండొకమేలు=ఒకానొకయుపకారము, (ఎట్టులనఁగా) సత్వసంపన్నుఁడు=బలముతోఁగూడియున్న,భీముఁడు = కుంతీపుత్రుఁడు, ఏకచక్రమందున్=ఏకచక్రమను పురమందు, ఎన్నికగాన్=ప్రసిద్ధిగా, బకాసురున్=బకుఁడను రాక్షసుని,ఏపునన్ = పరాక్రమముచేత,రూపు + అడగించి=చంపి,ఆద్విజుల ప్రాణములు=బ్రాహ్మణయసువులను, కావడు+ఎ=రక్షింపలేదా? (కాపాడెననుట.)

తా. ఏకచక్రపురంబున భీముఁడు భిక్షాటనము సేయుచు, నచ్చటవారి కెల్లరకు విరోధియగు బకుఁడను రాక్షసునిఁ జంపి బ్రాహ్మణబాలుని రక్షిం

---

97. తా. బకాసురుఁడు - వీఁడొక దైత్యుఁడు. ఏకచక్రపుర సమీపారణ్యమున నివసించుచుండెను. వీఁ డప్పురియందుగల మనుష్యుల దినమున కొక్కనివంతుగా నేర్పఱచుకొని భక్షించుచుండెను. భీముఁ డాయూద నెఱింగి పోయి యా రాక్షసునిఁ జంపి పురరక్షణముఁ గావించెను,

చినట్లు, లోకమున నేర్పరియగు వాఁడొక వేళ నసమర్థుఁడై యున్నను, లోకుల
కుపకారము సేయుచుండును.

చ॥ సరసగుణప్రపూర్ణునకు • సన్నపుదుర్గుణ మొక్క వేళయం
దొరసిననిట్లు నీకుఁదగు • నోయని చెప్పినమాన నేర్చుఁగా
బురదయొకించుకంత తము • బొందిన వేళలఁజిల్లవిత్తుపై
నొరసిన నిర్మలత్వమున • నుండవె నీరములెల్ల భాస్కరా. 98

టీ. భాస్కరా! సరసగుణప్రపూర్ణునకున్=మనోహరమగు గుణ
ములచే నిండినవానికి, సన్నపుదుర్గుణము=చిన్న చెడుగు, ఒక్కవేళయందున్=
ఒక సమయమందు, ఒరసినన్=ప్రాప్తమైనను, ఇట్లు నీకున్ తగున్ +
ఓ=ఇట్లు సేయుట నీకుఁదగునా, అని చెప్పినన్=అని వచించినను, మానన్ +
నేర్చున్ + కా=విసర్జించునుఁగదా! బురదతాన్=అపంకము (బురద) ఒకిం
చుకంత=కొంచెము, తమున్=తమ్ము, పొందినవేళన్=పొందినట్టి తరుణముల
యందు, చిల్లవిత్తు=ఇందుపుగింజ, పైన్=తనమీద, ఒరసినచోన్=తాకిన
చో, నీరములు ఎల్లన్=ఉదకములన్నియు, నిర్మలత్వమునన్=శుభ్రత్వము
చే, ఉండవు + ఎ=ఉండవా? పరిశుభ్రముగా నుండుననుట.)

తా. జలము లొకప్పుడు బురదగానున్నను, ఇండుపుగింజ గంధము
బురదనీటిలోఁ గలిపిన నెట్లు నిర్మలముగానుండునో, అట్లే గుణవంతున కొ
దుగుణమున్నదని యెవ్వరైనఁ జెప్పినచో దానిని వర్జించుకొనఁగలఁడు.

చ॥ సరసదయాగుణంబుఁగలజాణమహింగదు నొచ్చియుండియుం
దఱుమఁగవాని కాసపడి • దాయగవత్తురు లోకులెల్లనం
జెఱకురసంబుగానుఁగను • జిప్పిలిపోయిన మీఁదఁబిప్పియై
ధరఁబడియున్నఁజేరఁజెమఁదంబునఁజీమలు పెక్కు భాస్కరా.

టీ. భాస్కరా! సరసదయాగుణంబు=మంచికృపాస్వభావము, కల జాణ=కలిగిన నేర్పుఁగలవాఁడు, మహిన్=భూమియందు, కడున్=మిక్కిలి, నొచ్చియుండియున్=నలగియున్నప్పటికిని, తరచుగన్=ఎక్కువగా, లోకులు=జనులు, వానికిన్=అబాధపడుదాత నిమిత్తము, ఆసపడి=ఆశించుకొని, దాయన్ + క + వత్తురు=సమీపించెదరు, ఎట్లు + అనన్=ఏలాగు ననఁగా, గానుగన్=గానుగవలన, చెఱుకురసంబు=ఇక్షురసముయొక్క సిరు, చిప్పిలిపోయినన్=కారిపోగా, మీదన్=పిమ్మట, పిప్పి + ఐ=రసావిహీనమైనదయి, ధరన్=భూమిమీద, పడియున్న=పడినప్పటికి, పెక్కుచీమలు=అనేకపిపీలికములు, ముదంబునన్ = సంతోషములో, చేరవు + ఏ=చేరియుండవా?

ఇక్షురసమంతయు గానుగవలనఁ బిండఁబడినవెనుక నాపిప్పియంతయు చీమలపాలగునట్లు; దాత ద్రవ్యహీనుఁడైనను ప్రజలాతని వద్దకేఁ జేరుచుండెదరు.

ఉ॥ సారవివేకవర్తనల • సన్నుతికెక్కిన వారిలోపలం
జేరినయంత మూఢులకుఁ • జేపడ దానడ; యెట్టులన్నఁగా
సారములోన హంసములు • సంగతినుండెడి కొంగపిట్టకే
తీరునఁగల్గ నేర్చును ద• దీయగతుల్ దలపోయభాస్కరా. 100

టీ. భాస్కరా! సార=బలమైన, వివేక=యోగ్యాయోగ్యముల వివరములగలఁ, వర్తనలన్=నడవడులచే, సన్నుతికిన్=పొగడ్తకు, ఎక్కినవారి లోపలన్=ఎక్కినమనుజులలో, చేరినయంతన్=కూడినమాత్రముచే, మూఢులకున్=యోగ్యత నెఱుంగనివారికి, ఆనడ=ఆనుంచిప్రవర్తన, చేపడను=ప్రాప్తముకాదు, (ఎట్లనఁగా) కాసారములోనన్=తటాకములో, హంసములసంగతిన్=రాయంచలయొక్క చెల్మితో, ఉండెడి కొంగపిట్టకున్=

నసించెడి బకమునకు, తదీయగతుల్=ఆహంసనడకలు, తలపోయన్=ఆలోచింపఁగా, ఏతీరునన్=ఏవిధమున, కల్గ నేర్చును=లభించును? (కలుగదని యర్థము.)

తా. కొలనులో రాయంచలఁగూడి నిత్యము సంచరించుచున్నను హంసగమనములు కొంగలకు లభింపనట్లు; లోకమున జ్ఞానులతో నెన్ని దినములు, చెలిమిఁజేసినను, మూర్ఖులకా సత్ప్రవర్తన రాఁబోదు.

ఉ॥ స్థానము తప్పివచ్చునెడఁ • దా నెటువంటి బలాఢ్యుడున్ నిజ
స్థానికుఁడైన యల్పునిక • తంబున నైనను మోసపోవుఁగా;
కానలలోపలన్ వెడలి • గంధగజంబొకనాఁడు నీటిలోఁ
గానకచొచ్చినన్ మొసలి • కాటునలోఁబడదోటుభాస్కరా.

టీ. భాస్కరా! తాన్=తాను, ఎటువంటిబల + అఢ్యుడున్=ఎంతటిబలముఁగలవాడయినను, స్థానమున్=తనచోటును, తప్పి=విడిచి, వచ్చునెడన్=వచ్చినయెడల, నిజస్థానికుఁడు=తనతావుననున్న వాఁడు, ఐనయల్పునికతంబుననైనన్=అయినట్టి నీచునిచేతనైనను, మోసపోవును=వంచింపఁబడును, ఎట్లనఁగా; గంధ=మదించిన, గజంబు=గజేంద్రుఁడు, ఒకనాఁడు=ఒక దినమందు, కానలలోపలన్=అరణ్యములలోనుండి, వెడలి=బయలుదేరి, కానక=చూడక, నీటిలో, చొచ్చినన్=కొలనులోఁజొరఁబడఁగా। మొసలి కాటునన్=నక్రముయొక్క నోటికి,లోఁబడదోటు=లొంగిపోయినదికాదా?

---

101. తొల్లి గజేంద్రుఁడు స్త్రీగజంబుల వెంటఁగొనివచ్చి దప్పిచేనొకతటాకంబున జలముఁ గ్రోలుచుండెను. ఆకొలనులోనివసించియున్న మొసలియొకటి గజేంద్రుని కాలొడిసిపట్టి వదలకున్న, నా గజముతన శక్తినంతయు ధారవోసి వేయివత్సరములు మకరితో బోరాడినను జయింప లేక హరినిఁ బ్రార్థించెను. శ్రీమహావిష్ణువుఁ దనచక్రముచే నక్రమును సంహరించి గజరాజును రక్షించెను.

తా. గజేంద్రుఁడు బలముఁగలవాఁడైనను, స్వస్థానమును విడిచి, కొలనులో దిగినంత మాత్రమున నల్పజంతువగు మొసలికిఁజిక్కినటుల, లోకములో మనుష్యులు తామెంత బలముఁగలవారయినను తమస్థానమునువిడిచి వచ్చినప్పుడు క్షుద్రులమూలముననే వంచింపఁబడుదురు.

చ॥ సిరిఁగల వానికెయ్యెడలఁ • జేసిన మేలది నిష్ఫలంబగున్
నెఱిగుఱిగాదు పేదలకు • నేర్పునఁజేసిన సత్ఫలంబగున్
వఱపునవచ్చి మేఘుఁడొక • వర్షమువాడిన చేలమీఁదటం
గురిసినఁగాక యంబుధులఁ • గుర్వఁగనేమిఫలంబుభాస్కర

టీ. భాస్కరా! సిరి=సంపద, కలవానికిన్=కలిగియున్నవానికి, ఏ + యెడలన్=ఎట్టివేళల యందును, మేలు=శుభము, చేసిన=ఒనర్చినచో, అది=ఆ మేలు, నిష్ఫలంబగున్=ప్రయోజనము లేకపోవును, నెఱి=నిండయిన, గుఱికాదు=లక్ష్యముండదా, పేదలకున్=బీదవారికి, నేర్పునన్=ఉపాయముచేత, చేసినన్=శుభముఁగూర్చినచో, సత్ఫలము=మంచిలాభము అగున్=అగును, ఎట్టులనఁగా; మేఘుఁడు=జలదము, వఱపునన్=కఱవుని కాలమున, ఒక వర్షమున్=ఒకవానను, వాడిన చేలమీఁదటన్=పాడువారియున్న సస్యములమీఁద, కురిసినన్ + కాక=వర్షించిననేఁగాని, అంబుధులన్=సముద్రములయందు, కుర్వఁగన్=వర్షింపఁగా. ఏమిఫలంబు=ఏమిప్రయోజనము, కలదు. (లాభము లేదనుట).

తా. వానలు లేక ఎండిపోవుచున్న సస్యములపై మేఘుఁడు కురిసినచో లాభముండునుఁగాని, సముద్రములలో నెంతవర్షించిన నేమిఫలము. అట్లే మనుజులు నిరుపేదలకు మేలుఁజేసిన ఫలంబుగాని, ధనికునకుఁ జేసిన నేమిలాభము లేదు.

చ॥ సిరివలెనేని సింహగుహ • చెంతవసించినఁజాలు సింహముల్
కరులవధింపఁగానచటఁ • గల్గునుదంతచయంబుముత్యముల్
హరువుగనక్కబొక్కకడ • నాశ్రయమందిన నేమిగల్గెడుం
గొరిసెలుదోఁకతోఁకలును•గొమ్ములునెమ్ములుగాక భాస్కరా

టీ. భాస్కరా! సిరి=భాగ్యము, వలెనేని=కావలసినచో, సింహ గుహ చెంతన్=సింహము వసించెడి, గుహయొక్క చెంతన్=సమీపమున వసించినన్=నివసించినచో, చాలున్=తగును, ఏలనఁగా, సింహముల్, కరులన్=గజములను, వధింపఁగాన్=చంపుచుండుటచేత, దంతచయంబు= కరులయొక్క దంతముల సమూహము, ముత్యముల్=గజముల కుంభస్థలముల నున్న, ముత్యములు, అచటన్=అస్థలమున, కల్గును దొరుకును, ఎట్లులనఁ గా; హరువుగన్=చక్కఁగా, నక్కబొక్కకడన్=జంబుకంబు యొక్క బొక్కకడ, ఆశ్రమము + అందినన్=ఆశ్రయించినచో, గొరిసెలు=గిట్టలు, ను, దోఁకతోఁకలును=లేగల, పుచ్చములును, కొమ్ములు=చచ్చినజంతువులకొ మ్ములును, ఎమ్ములు=ఎముకలు,లు (శల్యములు) కాక=తప్ప, ఏమిగల్గెడున్ ఏమిలభించును, (ఏమియు దొరకవనుట).

తా. ఐశ్వర్యమునుఁ గోరువారు, సింహము గుహయొద్దకేగిన లాభ మున్నదిగాఁని, నక్కబొక్కదగ్గఱఁ గనిపెట్టుకొనియున్న నేమి ప్రయో జనము లేదు.

చ॥ స్థిరతరధర్మవర్తనఁ • బ్రసిద్ధికి నెక్కినవాని నొక్కము
ష్కరుఁడతినీచవాక్యములఁ• గాదనిపల్కిననమ్మహాత్ముఁడుం
గొఱతవహింపఁడయ్యెడ; న•కుంఠితపూర్ణసుధాపయోధిలో
నరుగుచుఁగాకి రెట్టయిడి•నందున నేమికొఱంత భాస్కరా

టీ. భాస్కరా! ఒక్కమనుష్యుఁడు=ఒకమూర్ఖుడు, స్థిరతరధర్మ వర్తనన్=మిగుల దృఢమైన న్యాయవర్తనము చేత, ప్రసిద్ధికిన్ + ఎక్కినవానికిన్=కీర్తి నొందినవానిని, అతినీచవాక్యములన్=మిక్కిలికఠినోక్తులచే కాదు అని=నిందఁజేసి, పల్కినన్=నుడివినను, అయ్యెడన్=అసమయమునందు, అమ్మహాత్ముఁడున్=అఘనుఁడును, కొఱతన్=లోపమును, వహింపఁడు=చెందఁడు, ఎట్లనఁగా, కాకి=వాయసము, అరుగుచున్=పైకెగిరిపోవుచు, అమృత=ఎక్కువ. పూర్ణ=నిండయిన, సుధాపయోధిలోన్=అమృతసరస్సున, రెట్ట ఇడినందునన్=మలము విడిచినంతమాత్రమున, ఏమికొఱంత=ఏమిలోపము. (లోపము లేదనుట)

తా. వాయసము గగనమార్గమున నెగిరి పోవుచు నమృతవారాశియందు రెట్టవైచినను లోపమెంత మాత్రముఁ గలుగనటుల; ధర్మాత్ముని నీచుడొకఁడు నిందించిన మాత్రమున నాతనికేమియులోటు గలుగదు.

చ॥ స్ఫురతర కీర్తిమంతులగు • పుత్రులఁగాంచినఁగాక మూఢము
ష్కరులఁగనంగఁ దేజములు • గల్గవుగా: మణికీలితాంగుళా
భరణము లంగుళంబుల శు • భస్థితిఁబెట్టినఁగాక గాజుటుం
గరములు పెట్టినందునవికాసముఁగల్గునటయ్య భాస్కరా. 105

టీ. భాస్కరా! స్ఫురతర=మిక్కిలి ప్రకాశముగానున్న- కీర్తిమంతులు=యశస్కులైనట్టివారు, అగుపుత్రులన్=అయినట్టి కుమారులను కాంచినన్ + కాక=కాంచినచో లాభముముగాని మూఢ=మూర్ఖులగు, ముష్కరులన్=అజ్ఞానులను, కనంగన్=కనినట్టయిన, తేజములు=ప్రతిష్ఠలు, కల్గవుగా=కలుగనేరవుగదా! ఎట్లనఁగా; మణి=రత్నములచే, కీలిత=స్థగితమైన, (కూర్పఁబడిన)అంగుళాభరణములు=అంగుళీయకములు, (ఉంగరములు) అంగుళంబులన్=వేళ్లయందు, శుభస్థితిన్=మంగళకరముగా, పెట్టినఁ

గాక=ధరించిన నేఁగాని, గాజుటుంగరములు, పెట్టినందునన్=ధరించుకొనుటవలన, వికాసము=అందము (వెలుగు) కలుగునటయ్యా=కలుగునా? (కలుగదనుట.)

తా. చేతి వ్రేళ్ళను రత్నస్థగితములగు నుంగరంబుల ధరించినచోఁ గాంతినిచ్చునుఁ గాని, గాజుటుంగరములు దాల్చిన వికాసము కలుగదు. అట్లే యశోవంతులగు పుత్రులఁగాంచినఁ బ్రతిష్ఠవచ్చునుగాని, మూఢులఁగన్నచో లాభము లేదు.

ఉ॥ హీనకులంబునందు జని • యించినవారికి సద్గుణంబు లె
న్నేనియుఁగల్గియున్న నొక • నేరము చెందకపోదు; పద్మముల్
భూనుతిఁగాంచియున్ బురదఁ • బుట్టుటవల్ల సుధాకరోదయం
బైనసహ్యమొందవె ప్రియంబునఁజూడఁగలేక భాస్కరా. 108

టీ. భాస్కరా! హీనకులంబునందున్=శవ్యవజాతియందు, జనియించినవారికిన్=పుట్టినవారికి, సద్గుణంబులు=మంచిగుణములు ఎన్నియుకల్గినన్=ఎన్నిగుణములు కల్గియున్నను, ఒక నేరము=ఒకశిక్ష, చెందకపోదు=కలుగకపోదు, ఎట్లనఁగా; పద్మముల్=కమలములు (తామరపూవులు) భూనుతిన్=భూప్రజలయొక్క స్తోత్రమును, కాంచియున్=చెందుచున్నను, బురదన్=అడుసునందు, పుట్టుటవల్లన్=జనియించుట నేడు దోషముచే, సుధాకరోదయంబునన్=చంద్రోదయమైనప్పుడు, ప్రియంబునన్=ప్రేమతో చూడఁగాలేక=చూడలేక, అసహ్యము ఒందవె=ఏహ్యముగా నుండదా?

తా. పద్మములుమిగుల ఖ్యాతిఁగాంచినను బురదయందు బుట్టుటచేత గలిగిన పాపముచే చంద్రోదయమునందనిష్టముతోఁ గాంచుచుండునుగాని, ప్రియముతోఁ జూడనటులు; గొడ్డువంశమున జనించిన మానవుఁడెన్నిసద్గుణములుఁగలవాడైనను నేదియో యొక హీనగుణ మలవడియుండును.

ఉ॥ ఇంచుక నేర్పుచాలక వి • హీనతఁజెందిన నాకవిత్వముల్
మించువహించె నీకతన • మిక్కిలియెట్లనఁదోలుబొమ్మలన్
మంచివివేకి వానితెర • మాటుననుండి ప్రశస్తరీతి నా
డించిన నాడవేజనుల • డెందమునింపవె ప్రీతిభాస్కరా.109

టీ. భాస్కరా! ఇంచుక = కొంచెము, నేర్పు = చతురత, చాలక = లేక, విహీనతన్ = నీచత్వమునను, చెందిన = పొందిన, నాకవిత్వమున్ = నాకవనముగూడ, నీకతన్ = నీశుభనామమునుఁ బద్యాంతములజేర్చిన హేతువుచేత, మిక్కిలి = ఎక్కువగా, మించువహించెన్ = ప్రకాశించెను, ఎట్లనఁగా; మంచివివేకి = మంచిబుద్ధిఁగలవాఁడు, తోలుబొమ్మలన్ = చర్మవిగ్రహములను, వాని తెరమాటునన్ = వానియొక్క యవనిక చాటున, ఉండి = వసించి, ప్రశస్తరీతిన్ = మంచిపద్ధతిన్, ఆడించినన్ = నృత్యముచేయించినయెడల, ఆడవే = నాట్యముసేయవా? ప్రీతిన్ = సంతోషముచే, జనుల డెందము = ప్రజలయొక్క హృదయమును, నింపవు + ఎ = పూరింపవా; నిండిలపలేవా? (నిండుచున్నవని అర్థము.)

తా. గుణవంతుఁడు తెరచాటుననుండి నేర్పుతోఁ దోలుబొమ్మనినాడించి ప్రజానందమొసంగునట్లుగా, నీకరుణవలన నాకవిత్వము మానవులకు మహానందము గలిగించి విరాజిల్లకుండునా? (ఓసూర్యభగవానుఁడా! నీవెట్లాడించిన, నట్లాడితినేఁగాని నేనెందును స్వతంత్రుండనుఁగానని యీ పద్యాంతమునఁ దనయిష్టదేవుని భక్తిపూర్వకముగా స్తుతించి శతక రచనమును విరమించెను.)

టీకా తాత్పర్య సహితమగు
భాస్కర శతకము
సంపూర్ణము.